# ముఖచిత్రం



బ్రిజెట్ రీలె(1931- )

**బ్రిజెట్ రీలె** చిత్రకారిణిగా అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించింది. అమూర్త చిత్రాలను (Abstract painting) వేయడంలో ఆమె నేడు అగ్రగామి. అసలు ఆమె చిన్నప్పుడే అనుకొంది తానొక చిత్రకారిణిని కావాలని. ఆమె ప్రకృతిని పరికించింది. దానిని నిశ్వసించింది. దాని రంగులకు, వెలుగులకు ప్రతిస్పందించింది. రంగుచిత్రాలు వేయడంలో అసామాన్యులైన గత కళాకారులు - ముఖ్యంగా రూబెన్స్, సియూరత్, మోనెట్, మాటిసేలు - అంటే ఆమెకు ఎంతోగౌరవం.

ఒకే రంగులో అనేక ఛాయా భేదాలను ఉపయోగించి కొన్ని మౌలిక కళాఖండాలను నిర్మించింది. ఆ తరువాత రంగులను ఎన్ని రకాలుగా ఉపయోగించ వచ్చు అనే సంభావ్యతల అన్వేషణలో, క్రమ శిక్షణతో, కావాలనే ఆమె ముందుకు సాగి పోయింది. దీర్ఘమైన రంగుల అంచులు ప్రక్క ప్రక్కనే ఉండటానికి వీలైన ఆకృతులను ఎంచుకుంది. ఒక అస్థిర ప్రభాసతో వెలుగునిచ్చే కాంతి, అసలు ఆ కాంతిలోనే సూక్ష్మ ఛాయా భేదాలు కనిపించేట్టు ఆ ఆకృతులుంటాయి.

## చిత్రం

### ప్రవాహం (1964)

మధ్యభాగంలో గీతలను వంచి నొక్కడం వలన ప్రకంపిస్తున్న తన్యతతో గూడిన ప్రదేశం ఆకృతి కట్టింది. వక్రాన్ని చివరవరకు సాగదీసినా గూడ రేఖలు తెగిపోవు. అస్థిర చలన కాంతి పుంజాలలోనే ఉండి పోతుంది అనుద్గారిత శక్తి.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 డిసెంబర్ 1997 సంచిక 11

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **ప్రవాహం (1964)**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# The Touch of Words

I am not a believer in Platonic love the love that eschews the physical and embraces the soul. If I am in love or in the indomitable process of falling in love, then I'd invariably succumb to the unconquerable craving to touch her. I am not denying the soul and the rest of the spiritual paraphernalia that follows once you let in soul. All that I'm saying is that I can't love a woman and think that her body and her looks, however attractive, are mere delusions, like the mirage in a desert and her soul, whatever and wherever that may be, is the quintessential her.

Loving her and touching her are at times synonymous to me. Touching her at different levels. And in different ways. I am speaking here more of metaphorical tactility than of literal. Of tactility that may at one time assume the form of an intimate conversation, at another, some mutually shared moments of silence.

I may touch a woman and not touch her really. Nothing can be more ephemeral, more vacuous than an inexpressive touch. And I can't touch a woman without being overtly tactile. I'd rather touch the woman I love through conversation. Words touch deeper and more permanently. Meaningful conversation may engender physical passion between a man and a woman more poignantly than holding hands.

When I think of a couple in conversation with each other and not needing very much more for their physical and spiritual satiation, I invariably think of Shelley and his wife Mary in Rome. "We lived in utter solitude", wrote Mary. The Shelleys needed the solitude to enjoy each other's company, to explore a new form of physical love that transcended the body.

I've discovered silence that touches. Those rare moments have happened to me when one is finally with the woman one loves without having to express passion overtly. I feel her closeness and warmth. We don't speak and let the silence remain eloquent with the tender passion we feel for each other. A feeling of solicitude permeates the quiescence. Our reticence best conveys the hushed longing.

It's difficult to define love. It's maybe easier to say what love isn't than what love is. We have tried to express the quintessence of love down the ages and have come up with a huge cairn of definitions hiding love in the limbo. For me love is conversation - conversation that stems from the depths of the subconscious and spreads its myriad antennae into the very fabric of our being, triggering, amplifying, modulating the urges and instincts of our chromosomes. When such conversation stops and nothing can ignite it again between a man and a woman, there isn't any love, any tender passion, any romance left between the two of them. Most couples I've met and known for years haven't even discovered such conversation between them and yet they have lived together happily and have believed that they love each other. I've on the other hand found myself again and again deep in conversations with the women I've loved - conversation that has reiterated the bottomline that desire is dowsed fire.

*(Continued on Page 352)*

# క్లా సీమన్

– చక్రపాణి
– డి. చంద్రశేఖర రెడ్డి

ఒక విధంగా చూస్తే రచయితలు చిన్నపిల్లల్లాంటి వాళ్లు. పిల్లల్లాగే వాళ్లూ గెలుపంటే ఇష్టపడతారు. ప్రతి రచయితా తన హృదయాంతరాళంలో గుర్తింపుకోసం తహతహలాడతాడు. ఈ గుర్తింపు పొందడంలో ఒక సంతృప్తి, ఒక గర్వం, ముఖ్యంగా ఇందులో వ్యక్తిగా మాత్రమేకాక నా దేశం కూడా పాలు పంచుకుంటుంది కాబట్టి ఉండకతప్పదు నన్ను ఎంపిక చేసినందుకు ఔపచారికంగా కృతజ్ఞతలు తెలియజేయడం మాత్రమే ఈ ప్రసంగం లక్ష్యం కాదు.

ఈ బహుమానాన్ని ప్రకటించినప్పుడు ది న్యూయార్క్ టైమ్స్ దీనిపై అమెరికన్ విమర్శకుల అభిప్రాయాలను సేకరించేందుకు వ్యర్థ ప్రయత్నం చేసింది. మరి నా దేశంలోని విస్తృత ప్రచారం ఉన్న ప్రముఖ పత్రికలు కూడా ఈ అజ్ఞాత కవిని గురించి సమాచారం కోసం తీవ్రమైన అన్వేషణ ప్రారంభించాయి. నా రచనల మీద విమర్శనాత్మక విశ్లేషణలు లేకపోవడం వల్ల రచయితగా నా జీవితాన్ని గురించి, కార్యకలాపాల గురించి పూర్తిగా ఊహాజనితమైన అంశాలను ప్రచురించాయి. అదీ ఈ మీ నిర్ణయాన్ని ఫ్రాన్సుకు ఒక మహోపద్రవంగా నిందించనప్పుడు మాత్రమే.

కళా సాహిత్యరంగాలలో ఏ ఎంపికయినా ప్రశ్నకు దూరం కాదనీ, కొంత వరకు ఆ నిర్ణయం ఏకపక్షమేననీ తెలియనంత తెలివి తక్కువ వాణ్ణి కాదు. ఫ్రాన్సులోనూ, ఇతర దేశాల్లోనూ ఎందరో రచయితలు ఈ బహుమానానికి సమానార్హులుగా గుర్తించే వారిలో మొదటి వాణ్ణి నేను.

నాకు ఈ బహుమానం ఇచ్చినందుకు స్వీడిష్ అకాడమిలో రష్యన్ గూఢచారి సంస్థ దూరిపోయిందా అని ఆశ్చర్యం ప్రకటించిన పత్రికలు కూడా ఉన్నాయి.

నా రచనలు కష్టమైనవి, విసుగు పుట్టించేవి, చదివించలేనివి, అగమ్యగోచరమైనవి అన్న ఆరోపణలను పరిశీలిస్తే మనం సంపాదించుకున్న అలవాట్లకీ, స్థిరపడ్డ సంప్రదాయాలకీ ఏ మాత్రం భిన్నంగా ఉన్న కళాకారుడిపైనైనా ఇటు వంటి ఆరోపణలుంటాయని గమనించవచ్చు. ఒకప్పుడు ఇంప్రెషనిస్టు పెయింటింగులను ఆకారంలేని, అర్థంకాని పిచ్చిగీతలని కొట్టివేసిన వారి మనుమలు ఆ పెయింటింగులనే చూడడానికి అనంతమైన క్యూలలో నిలబడి చూస్తూ ఉండడాన్ని ఏమంటాం.

మీలో ఉన్న కె.జి.బి. ఏజెంట్లే నన్నెన్నుకున్నారన్న ఆరోపణ నటుండనివ్వండి. ఈనాటికీ సామాజికస్థిరత్వానికి వ్యతిరేకమయిన శత్రుశక్తులకు ప్రతీకగా సోవియట్ యూనియన్ కొంతమంది కళ్లల్లో మెదులుతూంది. ఈ శక్తులతో ఒక సామాన్య రచయితను నన్ను కలుపుతున్నారు. కళ కళకోసమే అన్న వ్యర్థ వాదానికి వ్యతిరేకంగా విప్లవశక్తులకు సాధనాలుగా నా రచనలను భావించడం తక్కువ తృప్తినేమీ కలిగించడం లేదు.

---

★ **కాకాని చక్రపాణి, డి. చంద్రశేఖరరెడ్డి** గార్లు వరుసగా ఆంగ్ల, తెలుగు శాఖలలో ఉపన్యాసకులుగా ఆంధ్ర సారస్వత కళా పరిషత్ కళాశాలలో పనిచేస్తున్నారు.

'ఒక మొదలూ ఒక తుదీ లేదన్న కారణంగా నవలల్ని విమర్శించడం సరయిందే. ఇక్కడ నా రచనలను నిందించడానికి వాడే రెండు మాటల గురించి నేను చెప్పాలి. నా రచనలు 'శ్రమ' జన్యాలనీ అందువల్ల 'కృత కాల' నీ అన్న విమర్శ. కృతకం అంటే సహజం కానిది. అంటే ప్రకృతి సహజమైనది కాక మనిషి నిర్మించింది. మనిషి నిర్మించిన ఈ వస్తువు కళాత్మకమయింది. ఇట్లా అర్థం చెపితే బాగానే ఉంటుంది. కాని ఈ కృతకమన్న మాటకున్న దురర్థాలే బాధకాలు.

వస్తువు విలువ లేక దాని వినియోగవిలువ - అందులో ఎంత మానవ శ్రమ ఉందో అదే దాని విలువ అని మార్క్స్ అన్నాడు. నేను తత్వవేత్తను కాని, సామాజిక శాస్త్రవేత్తను కాని కాదు. అయినా పందొమ్మిదో శతాబ్దంలో యంత్రాల అభివృద్ధి, తీవ్రమైన పారిశ్రామికీకరణలకు సమాంతరంగా ఒకవైపున ఒక అపరాధ భావన పెరగడమూ మరోవైపున శ్రమ అన్న మాటకున్న విలువ పడిపోవడమూ గమనించాను. ఈ విధంగా రచయిత కృషికి విలువపోయి, ఒక దివ్యావేశానికి ప్రాధాన్యం ఏర్పడింది. దీనివల్ల ఒక మానవాతీత శక్తి పలికించే వ్యక్తిగా కేవలం వార్తా హరుడుగా రచయిత మారతాడు. అతనిలోని స్వీయస్పృహ ఉన్న కళాకారుడు పక్కకు జరుగుతాడు. అతడు ఒక నకలు రాతకాడో, ఎక్కడో ఎప్పుడో రాసిన పుస్తకానికి అనువాదకుడు గానో, ఎవరో నిర్దేశించిన సందేశాలను సామాన్య భాషలోకి మార్చి అందించే వార్తాహరుడుగానో మారతాడు. దీనికే 'దైవానుగ్రహం' అని పేరు. దీనివల్లకాగితం మీదకలం పెట్టకముందే ఇతర సామన్యమానవుల కందని ఒక జ్ఞానం అతన్ని ఆవరింస్తుంది. అంటే రచయిత ఇతరులకీజ్ఞానాన్ని బోధించడానికి తాను నియమితుడయిన్నట్లుగా భావిస్తాడు. నవల మతబోధలా తయారవుతుంది. ఆ విధంగా రచయితా అతని కృషి తద్వారా ఉద్భవించిన నవలా అదృశ్యమవుతాయి.

'చివరికి నవల చచ్చిపోయిందన్న పుకారును నిజం చేయడానికేనా క్లాడ్ సీమన్‌కు నోబెల్ బహుమతినిచ్చింది?' అని ఒక విమర్శకుడడిగాడు. అతనంటున్నది పందొమ్మిదో శతాబ్దంలో స్థిరపడ్డ నవలయే కనక అయినట్లయితే అది ఖచ్చితంగా చనిపోయిందన్న విషయం అతను గమనించలేదన్న మాట.

  

ఈ శతాబ్ద ప్రారంభంలో ఇద్దరు మహారచయితలు ప్రౌస్ట్, జాయిస్‌లు కొత్తమార్గాలు తెరిచారు. వాళ్లు ఒక కొత్త పరిణామాన్ని మాత్రమే మెల్లగా ఆరంభించారు; ఆ క్రమంలో వాస్తవిక నవల అనబడే నవల మెల్లగా ఆత్మహత్య చేసుకుంది.

'ఇక్కడ సౌందర్యం ఉంటుంది అని నేనెప్పుడు ఊహించని చోట్ల సౌందర్యాన్ని అన్వేషించడానికి తపన పడ్డాను' అన్నాడు ప్రౌస్ట్. నీతి కథ అంటే కథ నుండి నీతిని బయటకు తీయగలిగిన కథ అని అర్థం. కాని ఇది వాస్తవమా? ముందే నీతిని నిర్ణయించుకొని దానికోసం కథ నల్లడం లేదా? మధ్య కాలపు నీతికథ నుండి పద్దెనిమిదవ శతాబ్దపు తత్వకథ, దానినుండి ఇరవయ్యో శతాబ్దపు వాస్తవిక

నవల పరిణమించాయి. నవలలో వర్ణన దగ్గరకు రాగానే పేజీ తిప్పుతానన్నాడు హెన్రీ మాంతర్‌లాన్. రాస్కో-లింకోవ్‌గది వర్ణన చదివి విసుగెత్తి చచ్చిపోయానన్నాడు ఆంద్రెబ్రెతన్. రచయితకెవడిచ్చాడీ అధికారం అని కూడా కోప్పడ్డాడు.

సంప్రదాయ నవలలోని పాత్రలు అనేక సాహసకృత్యాల మీద ఆధారపడి ఉంటాయి. ఈ సాహస కృత్యాలు ఒకదాని మీద ఒకటి ఆధారపడి, కారణాలు ఫలితాలు అన్న సూత్రాన్ని అనుసరించి, నవలకు నిర్ణీతమయిన ముగింపును కలిగిస్తాయి. ఈ నిర్ణీతమయిన ముగింపు ప్రపంచాన్ని గురించి, చరిత్రను గురించి, స్త్రీ పురుషులగురించి పాఠకులు ఏర్పరచుకోవలసిన దృక్పథాన్ని చెప్పడానికి రచయిత సిద్ధాంతానికి బలం చేకూరుస్తుంది. ఇందులో విసుగెత్తించేదేమంటే ఈ నిర్ణీత సన్నివేశాలన్నీ వాటిని చెప్పేరచయిత మంచితనం మీద ఆధారపడి ఉంటాయి. ఒక పాత్ర మరోపాత్రను కలుసుకోవడం, కలుసుకోకపోవడం, ప్రేమలో పడడం, పడకపోవడం, చావకపోవడం రచయిత ఇష్టం మీదనే ఆధారపడి ఉంటుంది. జరగదగినసన్నివేశాలు జరగకపోవచ్చు. పాత్రలన్నీ ఒక మూతలో పోసినట్టుంటాయి. అందమైన స్త్రీల శరీర ఛాయ గులాబీ రంగులోనే ఉంటుంది, వృద్ధ స్త్రీలంతా భయంకరంగానే ఉంటారు, నీడలన్నీ చల్లగానే ఉంటాయి, ఎడారులన్నీ దుర్భరంగానే ఉంటాయి. బాల్జాక్ ప్రతిభ వీటికి అడ్డుకట్టవేసింది.

**బూడిదతో అజ్ఞాతాన్ని జ్ఞాతం చేయడం**

క్లాడ్ యూజిన్ హెన్రీ సీమన్ 10 అక్టోబరు 1913లో అప్పట్లో ఫ్రెంచ్ వారి అధీనంలో ఉన్న తననరివ్, మెడగాస్కర్‌లో, లూంబా ఆంటోనీ సీమన్, సుజానే డెనమీల్ సీమన్‌లకు జన్మించాడు.

ఇతడు మొదట కళాకారుడు కావాలనుకొని ఆంద్రీ లోట్ (Andre Lhote) దగ్గర చిత్రలేఖనం అభ్యసించి, రెండో ప్రపంచ యుద్ధంలో ఆప్రయత్నం మానివేశాడు. ఆతరవాతనే రచయిత అయ్యాడు. అతని మొదటి నవల The Cheater (1945). తరవాత Colluvial (1952) The Rites of Spring (1945)లో వెలువడ్డాయి. ఇంగ్లీషులో అనువాదమైన అతని మొదటి రచన The Wrid (1957) The Grass (1958), The Flanders Road (1966), The Palace (1962), The World about us (1975), The Acarcia (1989) లలో వచ్చాయి.

''మానవుని అవస్థను చిత్రించడంలో కవి, చిత్రకారులు - ఇద్దరి సృజనాత్మతామేళింపుకు కాలసంబంధ గాఢ జాగృతిని జోడించి నవలా రచన ఎవరు చేశారో అతనికి''

– సంపాదకుడు

ఒక సుదీర్ఘ పరిణామానంతరం చిత్రకారుడు వస్తువును అభివ్యక్తం చేయడం ఆపి, దాన్ని

ఉత్పన్నం చేయడం ఆరంభించాడు. అట్లాగే రచయితకూడా. ఒక సన్నివేశం మరోసన్ని వేశంతరువాత ఎందుకు వస్తుంది లేకపోతే ముందే ఎందుకు వస్తుంది అన్నది ఆ సన్నివేశాల అంతర్గత లక్షణాల బట్టే ఉంటుంది.

ఎందుకు రాస్తారు? ఏం చెప్తావు? అన్న శాశ్వతమైన ప్రశ్నకు సమాధానంపై ఒకసారి మన దృష్టిని మరలుద్దాం. ఎవరైనా నువ్వేం చెప్పదలచుకున్నావు? అని అడిగితే, నేనేమీ చెప్పదలచుకోలేదనీ, నేనొక దాన్ని నిర్మించదలచుకున్నానీ, ఈ నిర్మాణాకాంక్షయే నేను చెప్పదలచుకున్న దాన్ని కోరుతున్నది' అని పాల్ వాలెరీ రాశాడు. ఈ నిర్మించడంలోనే తన గుర్తింపు ఉంది. అది వంతెనకావచ్చు, ఓడకావచ్చు, పంటకావచ్చు, పాటకావచ్చు. గ్రీకు భాషలో నిర్మాణం, పద్యం అనే మాటలకు ధాతువు ఒకటే. భాషను ఉపయోగించడంలో కవికి ఇచ్చే స్వేచ్ఛ వచన రచయిత కెందుకు ఇవ్వకూడదు?

నేనిప్పుడు వృద్ధుణ్ణి. మన పాత యూరపులో నివసించిన వారందరి జీవితాలలాగానే నా బాల్యజీవితమూ విఘ్న రహితం కాదు. ఒక విప్లవాన్ని చూశాను. చావు తప్పని ఒక యుద్ధంలో పాల్గొన్నాను. బందీనయ్యాను. ఆకలి అంటే ఏమిటో తెలుసు. శుష్కించిపోయేంతవరకు బలవంతంగా పనిచేయించారు. తప్పించుకున్నాను. తీవ్రంగా జబ్బుపడ్డాను. ఎన్నోసార్లు సహజ మరణానికీ, బలవన్మరణానికీ దగ్గరగా వచ్చాను. మతాధికారులూ, చర్చిలు తగలబెట్టేవాళ్ళూ, శాంతి వాదులయిన బూర్జువాలూ, అరాచక వాదులూ, తత్వవేత్తలూ, నిరక్షరకులూ అన్ని రకాల వాళ్లతోనూ భుజాలు రాసుకొని తిరిగాను. తిరుగుబోతులతో సహవాసం చేశాను. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచాన్ని బాగా చూశాను. కాని దేనికీ అర్థం లభించలేదు. షేక్స్పియర్ అనుసరణలో బార్త్ అన్నట్లు 'ఈ ప్రపంచం దేన్నైనా సూచిస్తే అది దేన్నీ సూచించడం లేదన్న విషయాన్ని మాత్రమే' - దాని ఉనికిని మాత్రం సూచిస్తుంది.

నా తెల్ల కాగితం ముందు రెండు విషయాలున్నాయి. ఒకవైపున నాలో ఉన్న భావోద్వేగాలు, స్మృతులు, ఊహలు. మరోవైపున భాష. నేనెన్నుకోవలసిన పదాలు, ఆ పదాలను ఒక క్రమంలో అమర్చడానికి వాక్య నిర్మాణ సూత్రాలు. నేను మొదట గమనించిందేమిటంటే రచయిత రాసేది రచనకు పూర్వం జరిగింది కాదనీ. రచనా క్రమంలో అది తన్నుతాను తనలోంచి ఉత్పన్నం చేసుకుంటుందనీ. నా విషయంలో నా రచన నేను ఉద్దేశించిందానికంటే ఉత్కృష్టమైంది.

ఒకయుద్ధాన్ని వర్ణించడంలో స్టెంధాల్ దీన్ని అనుభవించాడు. దీన్ని సహజంగా వర్ణించడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తుండగా, ఆకస్మాత్తుగా తానంతకు ముందు చూచిన శిల్పాన్ని వర్ణిస్తున్న భావన అతనికికలిగింది. ఈ శిల్పం వాస్తవికతస్థానాన్ని ఆక్రమించిందని అతననుకున్నాడు. కాని సరిగా ఆలోచిస్తే ఆ శిల్పంలోని తుపాకులు, నాగళ్లు, గుర్రాలు మొదలైన వస్తువులనన్నింటినీ ఎవరైనా ఊహించవచ్చు. కాని స్టెంధాల్ ఆ శిల్పాన్ని కూడా వర్ణించడం లేదనీ, అప్పుడే అతని

మనసులో రూపొందుతూన్న ఒక ఊహ ఆ శిల్పం స్థానాన్ని కూడా ఆక్రమిందనీ అర్థమవుతుంది.

కళలో పాత సంప్రదాయాన్నుండి విడిపోయే స్థితి ఎక్కడ వచ్చిందంటే, చిత్రకారులు, రచయితలు, కనిపిస్తున్న ప్రపంచానికి ప్రాతినిధ్యం వహిస్తున్నామన్న భావాన్ని విడిచిపెట్టి, ఆ ప్రపంచం తమ మీద కలిగించిన భావాల ముద్రలలో తృప్తిపడ్డప్పుడు.

'ఆరోగ్యవంతుడయిన మనిషి తన మనస్సులో ఒకేసారి అసంఖ్యాకమయిన విషయాలను ఆలోచిస్తూంటాడు, అనుభవిస్తూంటాడు, స్మరణకు తెచ్చుకుంటూంటాడు' అన్నాడు టాల్‌స్టాయ్. ఫ్లాబర్ట్ నవలలో ఒక రోగగ్రస్తురాలైన స్త్రీ మగతలో ఉండి, ఒకేసారి అనేక విషయాలను చూస్తుంది. టాల్‌స్టాయ్ ఆరోగ్యవంతుడి గురించి మాట్లాడితే ఫ్లాబర్ట్ పాత్ర రోగి. అయినా మనిషి మెదడులో ఒకేసారి వేనవేల చిత్రాలుంటాయన్న విషయంలో విప్రతి పత్తి లేదు. రచయిత మెదడులోనూ ఇలాగే ఉంటుంది.

పునఃసృష్టి కాదు సృష్టి; అభివ్యక్తికాదు ఆవిష్కరణ; అనుకరణ కాదు సృజన.

రాసిన ప్రతిరచనా ఏదో విధంగా ఎంతో కొంత ప్రపంచాన్ని పరివర్తనం చేస్తుందన్న భావం రచయితను రచనవైపు మళ్లిస్తుంది. అప్పుడు ఒక ప్రారంభంతో మొదలై ఒక ముగింపును చేరుకొనే నవలా రచయితకంటే ఈ రచయిత భిన్నంగా ఉండక తప్పదు. తెలియని ప్రాంతాలను కనుగొనే ప్రయత్నం చేసే అన్వేషకుని మార్గం ఇది. ఇందులో ఎన్నో కష్టాలుంటాయి. మార్గాన్ని మళ్లీ మళ్లీ సరిచూసుకోవాలి. ఒకేలాగా ఉండే ఎన్నో తోవలు, ప్రదేశాలు దారి తప్పిస్తుంటాయి. దాటిన దారుల్నే మళ్లీ దాటవలసి రావచ్చు. ఒకటి కంటే ఒకటి దగ్గరకాని దూరంకాని కాని భావాల, ఉద్వేగాల ఉనికిలోకి ఈ అన్వేషణ చివరికి మనం బయలు దేరినచోటికే తీసుకొని రావచ్చు. కాని కొన్ని, దారులు, కొన్ని వంతెనలను, కొన్ని విలక్షణతలను గుర్తించడం మాత్రం జరుగుతుంది. చెప్పవలసిందంతా చెప్పే హక్కు నాదనకుండా, ప్రతి వ్యక్తీ ఎక్కువో తక్కువో ఎంతో కొంత తనను కూడా గుర్తించే స్థాయిని చేరుకోవచ్చు.

అనంతమైన నూతన ప్రదేశాన్ని అన్వేషించడంలో దాన్ని వివరించే ఒక అసమగ్రమయిన చిత్రపటాన్ని గీయడంలో అలసిపోయే వ్యక్తి మార్గం ఇది. దాని ప్రయాణంలో నిర్దిష్టమైన కుతూహలాన్ని కాని, మనస్సు చెప్పిన మాటల్ని కాని తన శక్తి మేరకు అనుసరించిందీ లేనిదీ అతడు నిశ్చయంగా చెప్పలేడు. ఏదీ నిశ్చితం కాదు. ఒక సమతౌల్యం. ఒక సంగీతం. అంతకంటే మరే గారంటీ ఇవ్వలేడు. దాని కోసం వెదుకుతూ రచయిత శ్రమతో కూడిన ప్రగతిని మాత్రమే సాధిస్తాడు. గుడ్డివాడిలాగా తనలో తను వెదుక్కుంటూ ఎదురుదెబ్బలు తింటూ, మళ్లీ ముందుకు సాగే ప్రయత్నాలు ఆరంభిస్తాడు. అతని ప్రయత్నాలలో మనం ఏదైనా నీతిని గ్రహిస్తే అది మన కాళ్లకింద కదులుతూన్న ఇసుకలో మనం ముందుకు నడుస్తున్నామన్న విషయాన్ని గ్రహించడమే.

# కథా వస్తువు : దేశీయత

– ''శ్రీవిరించి''

ఇటీవల పునర్ముద్రణ పొందిన ఒక ప్రసిద్ధ నవలకు ముందు మాటలుగా 'నవలా వృత్తాంతము' అని వ్రాస్తూ ఒక పరిచయకర్త యిలా అన్నారు:

''బుచ్చిబాబు అనేక కథలు వ్రాశాడు
ఒక ముఖ్యమైన నవల కూడ వ్రాశాడు
కాని అన్నింటా ఆయన చెప్పింది ఒకటే కథ
తెలుగు దేశంలో జరిగే పాశ్చాత్య కథ''

ఆ పరిచయ కర్త వెలిబుచ్చిన అనేక అభిప్రాయాలను అలావుంచి 'వాస్తవికత'. గురించి అన్నా యీవాక్యాలు కూడా గమనార్హం:

''జీవితంలో విషాదం వుంటుంది
కామెడీ వుంటుంది.
డ్రామా వుంటుంది.
కరుణ వుంటుంది.
కాని మెలోడ్రామా వుండదు
వాస్తవికతకు కట్టుబడినవాడు రొమాంటిసి నిజాన్ని,మెలోడ్రామాను నిరోధించాలి.
లేకపోతే వాస్తవికత చెట్టెక్కి పోతుంది.
నవలకు వాస్తవికత పట్టుగొమ్మ''

ఈ వాక్యాలు చూచిన మీదట బుచ్చిబాబును మనం ఎంతగా అపార్థం చేసుకున్నామో, వాస్తవికత అనే విషయాన్ని కూడ అంతే దురర్థం చేసుకున్నాం అనిపించింది.

బుచ్చిబాబు కీర్తి శేషుడయిన ప్రఖ్యాత తెలుగు రచయిత. 'చనిపోయిన వాళ్ల మీద బాణాలు సంధించడం మంచిదికాదు, తమను తాము సమర్థించుకునే అవకాశం వాళ్లకు లేదు గనుక-' అనే ఉద్దేశంతో నేను ఈవ్యాసం వ్రాయడం లేదు. ఒకవేళ బుచ్చిబాబు ఈరోజున జీవించివున్నా తన మీద వస్తున్న అనేక 'విమర్శ'లకు పనికట్టుకుని సమాధానం చెబుతూ కూర్చోడని నాకనిపిస్తుంది. చేయదలుచుకున్న – వలసిన పనులను చేసుకుంటూ పోవడమే తప్ప వాటిని యేదృష్టితేనయినా విమర్శించకుంటూ పోయేవాళ్లకు జవాబులు చెప్పుకుంటూ ''కలకరణం'' చేయడానికి యిచ్చగించరు కొందరు. రచయితకు వున్న సాంఘిక బాధ్యతను గురించి రకరకాల అభిప్రాయాలకు అవకాశం వుంది. ఈ బాధ్యతను అతను యెలా నిర్వహిస్తున్నాడు అన్నది అతని ''చిత్తసంస్కారం'' మీదమటుకే ఆధారపడివుంటుంది గాని యితరుల ''శాసనాలను'' అనుసరించి వుండదు. ''బాధ్యత రాహిత్యం''గ కనిపించటం కూడా ఒక్కోసారి బాధ్యత యొక్క ''పరమ ప్రవర్తన'' అవుతుంది.

బుచ్చిబాబు కథలు 'తెలుగుదేశంలో జరిగే పాశ్చాత్య కథలు'' అనడంలో యిలాంటి యితివృత్తాలు తెలుగు దేశంలో జరగవు అన్న రూఢి అభిప్రాయం వుంది. పాశ్చాత్య భాషపాలనల

---

★ **శ్రీవిరించి,** అసలు పేరు **ఎన్. సి. రామానుజా చార్య.** ప్రసిద్ధ కథారచయిత. మద్రాసు అడయార్ థియోసాఫికల్ సొసైటీలో ఉంటారు.

ప్రభావమే కాకుండా 'తెలుగు జీవితం' లో కూడా కేవలం నేల - నీరు కాకుండా యితర అంశాలు వున్నాయన్న విషయం మనం యింతవరకు జీర్ణం చేసుకో లేక పోతున్నాం.

మనిషి పంచభూతాత్మకుడు - అనే మాట పాశ్చాత్య భావాలనుంచి మనకు వచ్చింది కాదు. అతనిలో అనేక 'వస్తుసంచయం' మిళితమైవున్నదనీ వీటన్నిటినీ సంబాళించుకుంటు అతడు జీవితం గడుపుతాడనీ, మనం పాశ్చాత్యుల దగ్గరనుంచేనేర్చుకోలేదు. మనిషికి మనస్సు, బుద్ధి అనే ఉపాంగాలు కూడా వున్నాయని, యివి అతన్ని, అతనిప్రవర్తన రీతులను రూపుదిద్దుతూ వుంటాయని మనం పాశ్చాత్యులు దగ్గరనుంచే 'విధిగా' నేర్చుకులేదనీ - అనుకుంటాను. పాశ్చాత్య మానసిక శాస్త్ర వేత్తల వచనాలు మనకూ ప్రసారం కావడం; వాటివల్ల మన 'మనో విశ్లేషణ' మార్గాలు మరింత చురుకుగా పల్లవించుకోవడం - జరిగింది.

బుచ్చిబాబు కథలలో నమూనాగా 'నన్ను గురించి కథవ్రాయవు'; అనేదాన్ని ఎన్నుకుని - యిది తెలుగు దేశంలో జరగటానికి వీల్లేదని ఎందుకు అనుకుంటున్నామో కొద్దిసేపు పరామర్శించటానికి ప్రయత్నిస్తాను.

ఈ కథలో సారాంశం (వస్తు అంశం) యిది.

కథకుడికి 'కుముదు' అనే స్త్రీతో దాదాపు పది సంవత్సరాల పరిచయం. ఈ పరిచయంలో వాళ్లు కలుసుకున్నదీ, మాట్లాడు కున్నదీ ఆరుగంటల సమయం; ఆరువందల మాటలు. ఆమె అతన్ని 'నన్ను గురించి కథ చెప్పవూ'? అనడుగుతుంది, మొదటి మాటు. తరువాత అదే ప్రశ్నను కొద్ది మార్పుతో ''నన్ను గురించి కథ వ్రాయవూ''? అంటుంది, మృత్యు శయ్యమీదవున్నప్పుడు.

కథకుడికి ఆమెలో 'కథా వస్తువు'గా వుండేటంతటి విశేషం వొక్కటి కూడ లేదు.

తనలో యేమీ 'విశేషం' లేదని అతనన్న మాటలు ఆమెను బాగా దెబ్బ తీస్తాయి - 'హర్ట్' చేస్తాయి. అందుకని, కలుసుకున్న ప్రతిసారీ తను సామాన్యమైన మనిషినని గుర్తుచేస్తుంది, దాదాపు చెప్పుతూ వున్నట్లుగా.

'పదిమందీ ఒక్క లాగున్నప్పుడు వారితో ఏ ఒక్కర్నీ గురించి చెప్పుకోం. కాని అందులో ఏ ఒక్కడైనా పదిమంది చేసినదానికి వ్యతిరేకంగా చేస్తే అతన్ని గురించి చెప్పుకుంటాం. అట్లాంటి వ్యక్తులని గురించి వ్రాయొచ్చు- 'అంటాడు మొదటి మారు.

కుముదాన్ని 'వర్ణించనంత మాత్రాన కథ' అవదనీ, వీళ్ల కుటుంబానికి 'చరిత్ర' లేదనీ కథకుడు చెప్పుకుంటాడు, తనకు తాను.

'ప్రేమ, సౌఖ్యము, ఆధ్యాత్మికము. దేశభక్తి- వీటిలో యేమి సాధించని స్త్రీజీవితం వృధా' - అని అతను అన్నప్పుడు 'ప్రతిస్త్రీ భర్తను వొదిలేసి మరోడితో వుండాలందూ, ప్రేమను సాధించేందుకు' - అని ఆమె సమాధానం చెపితే 'దానికోసం ఆ త్యాగం చెయ్యగలిగితేనే మెచ్చుకుంటాను' అంటాడు.

తరువాత కలిసినప్పుడు 'నిన్ను గురించి బోలెడు వినాలనుంది' అని అతను అంటే ఆమె చెప్పే సమాధానం.

'నన్ను గురించి వినేందుకే ముంది. మాదిసామాన్య బతుకు' -----'నీకు తెలియచేసేందుకు యిందులో యేం విశేషం వుంది? ఇది సాధారణంగా అందరికీ జరిగే పనే కదా? నీకీవిషయం వేరే చెప్పాలా?' ----'సృష్టిలో నేనెంతో అల్పురాలని తోటి వాడైన నీకే తోచినప్పుడు సృష్టిముందు నేనేం తిరుగు బాటు చెయ్యగలను చెప్పు'.

మరోసారి కలిసినప్పుడు 'ఈ తోటను చూస్తు ఆశ్చర్య పడుతున్నాను-' అని అతనంటే ఆమె 'ఇందులో ఆశ్చర్యం ఏముంది? విత్తనం వేసి నీళ్లు పోస్తే మొక్క మొలుస్తోంది. ఇవన్నీ సాధారణమైన మొక్కలు -' అని కొంటెగా నవ్వుతూంది.

చివరిసారి కలుసుకున్నప్పుడు 'జబ్బు సంగతి నాకు తెలీనే తెలీదు. పోనీ వోలు వుత్తరం ముక్క వ్రాయించకూడదా? -----' అన్నప్పుడు.

'జబ్బు చెయ్యడం సాధారణమైంది. పదిమందితోనూ చెప్పుకునేందుకు అందులో ఏవిశేషముంది. ఫర్వాలేదంటున్నారు డాక్టర్లు. కాని వాళ్లకేం తెలుసు? 'అని కళ్లు మూసింది.'

జబ్బుమంచం మీద వున్నప్పుడు, కథకుడు తనచెయ్యి ఆమె చేతిపైన ఆనించబోతాడు. కాని ఆమె 'వెంటనే చేతిని లాగేసుకుని తెల్లదుప్పటిలో దాచేసుకుంది'.

వెంటనే అంటుంది ఆమే.

'నువ్వెందుకు పెళ్లి చేసుకోలేదు నాకు తెలుసు. నాకోసం'- అంటూ మళ్లా కళ్లు మూసింది.

కథకుడు 'ఆమె నిశ్చల శరీరం పై నీకన్నీరు పడి మలినం చెయ్యడం పాపం అనిపించి' మొహం పక్కకు తిప్పేసుకుంటాడు.

తరువాత అతని అంతర్వేదన యిలా వుంటుంది.

'ఆనాడు ఆమెచెయ్యిపైనచెయ్యివేసినప్పుడు బుద్ధిని తొలగించి వాంఛలు బయటికొచ్చినట్లు, కుమదం గ్రహించి తనచేతిని లోపల దాచుకున్నట్లు, వాటిని వెనక్కి నెట్టి నోరు నొక్కింది. ఆమెలో ఏమీ విశేషం లేదని సమాధాన పరుచుకున్నా ప్రాకృతికమైన ఆకర్షణ లోపల దాగివుండి, నాజీవితంపై ఒత్తిడి కలిగించినందుకు ఆశ్చర్యపడ్డాను'.

'జీవితాన్ని గురించి - అందున స్త్రీ పాత్రను గురించి - అనేక అభిప్రాయాలు, ధోరణలలో భిన్నత్వాలు యీ కథలో వస్తాయి. దీనిలోని కుముదం 'నిజంగా మనిషి - ఊహలో వ్యక్తి కాదు.'

కథకుడు కుమదమంతో తన పరిచయాన్ని ఆసరాగా తీసుకుని - జీవితాన్ని గురించి కొన్ని సాధారణ వ్యక్తీకరణలు చేస్తాడు. సమాజ వర్తనాన్ని గురించి కొన్ని చురకలు వేస్తాడు.

'ముదుసలే జ్ఞాని కాగలడని భారతీయులు వెర్రి నమ్మకం. పెద్దలన్నా, ప్రాచీనులన్నా, పాతవిషయాలన్నా మనవాళ్ళకి అంత గౌరవం. ఒక విషయం మంచిదా చెడ్డదా అన్న తార్కిక సంశయాలకి సంఘంలో అంతగా తావులేదు. ఎటొచ్చీ ఆ విషయాన్ని ప్రతి పాదించిన వ్యక్తి మృతుడై వుండాలి.

'కథకుడు ఏంచెడిపోయిందో చెప్పగలడు. వీలైతే మిగిలని దానితోనే తృప్తిపడుతూ యితరులతో ఆ తృప్తిని పంచుకోగలడు. కాని బాగు చేసే విధానాలతో అతనికి నిమిత్తంలేదు.'కొన్ని ఆకస్మిక దృశ్యాలు జీవితకాలం పరిశీలించినా బోధపడని అంతరంగాలని తేలుపరుస్తాయి కాబోలు.

'కొన్ని సమయాలలో రాజకీయోద్యమంలో దిగి జైలుకెడదా మనిపించేది. అప్పుడు భుక్తికిలోటుండదు. కీర్తి దక్కుతుంది. పైగా జైలులో నే తలపెట్టిన మహత్తర గ్రంథాన్ని రచించటానికీ మంచి అవకాశాలంటాయి....'

'ప్రపంచాన్ని మనం ఏదైనా కోరి, ఆశిస్తే దాన్ని యివ్వదు. మనం దేన్నీ ఆశించకుండా, దూరంగా వుండి చెయ్యగలిగని పని చేస్తుంటే ప్రపంచం మన పాదాలముందు వాల్తుంది.'

కథాగమనానికి అటంకం కాకుండా - దోహదం చేస్తూ కొన్ని వర్ణనల వంటి వాక్యాలు

కలిగిస్తాయి. కథకు కావలసిన వాతావరణాన్ని యివి సమకూరుస్తాయి అనే విషయం అలావుంచి - అలాంటి వాక్యాలు చదువుతూ వున్నప్పుడు పాఠకుని చేతనంలో సుకుమారము, సునిశితము అయిన స్పందనలు, అనుస్పందనలు యేర్పడి అతని భావనాపటిమ ఒక స్థాయి పైకి ఎదగడానికి సహాయం అవుతుంది.

'మరోలోకంలో ఆత్మను మరచిపోయి, శరీరాన్ని తనిష్టం లేకుండానే ఇక్కడికి రపించునట్లు సంచరిస్తుంది. ఈ ప్రపంచంలో మూసుగుని మరోలోకంలో తెరుచుకున్న నేత్రాలు ఆమెవి.'

'లేడిగొంతులో శృంగారం వుంది కాని బలంలేదు. కుక్క పిల్ల గంతులో కొంటెతనం వుందికాని శక్తి లేదు. మేకపిల్ల గంతులో వేగం వుందికాని మృదుత్వం లేదు. ఇవన్నీ గుఱ్ఱంపిల్ల అలిగిననాడు చేసిన నాట్యంలో వున్నాయి.

'సిగిరెట్టు పీలుస్తూ, చీట్లాడుకుంటున్న సమయంలో అమాంతం గదిలోకి చిరతపులి వచ్చినప్పుడు, బుర్ర ఎట్లా పని చెయ్యదో, అట్లాగే ఆమెతో సంభాషణ '

'సూర్యుడు పడమటింట్లో గృహప్రవేశం అవగానే తలుపు వేసి కిటికీ కర్టెన్లు దగ్గరగా లాగడానికి సిద్ధ పడినట్లు మేఘాలు చురుగ్గా విహరిస్తున్నాయి'.

'సూర్యుడు అస్తమించగా అలసిన తన పరివారం పడమటిలోయలో స్వేద తీర్చుకుంటున్నట్లు వెలుగుఛాయలు కరుగుతున్నాయి. ఓపిక లేక కదల లేక పోయిన మేఘద్వయం దక్షిణపు గాలి పిలుపుకు కదిలి పోతున్నాయి. ఇది నారాజ్యం అన్నట్లు ఒంటి నక్షత్రం కన్ను మీటింది. ప్రకృతిలో నిశీథ కీటకాలు తన్మయపు రొద సాగించాయి. మా సంభాషణ వినివిని విసుగెట్టిన పుష్పాలు చీకటిలో ముడుచుకున్నాయి. తూర్పు ఆకాశం జడ విప్పుకుంది'.

తెలుగు కథానికను ఆధునీకరణం చేయడానికి ప్రయత్నించిన కథకులలో బుచ్చిబాబు ప్రధానుడు. అతడు వ్రాసిన కథలు పాశ్చాత్య దేశాలలోనే తప్ప, తెలుగుదేశంలో జరగవని ఎందుకు అనుకుంటున్నామో అర్థంకాదు.

భావనాపటిమ, మానసిక వేదనలకు రూపకల్పన, తద్వారా జీవితాన్ని 'సమగ్రం' చేసుకోవడం - యివి ప్రధానంగా యే భాషలోనయినా కథానికలు, కల్పనా సాహిత్యం చేసే పనులు. దీనిని కాదనుకునా, లేదనుకున్నా సాహిత్య ప్రయోజనాన్ని మనం పూర్తిగా అభిలషించడం లేదన్న మాట. అభివ్యక్తం చేసుకోలేక పోతున్న మన్న మాట. జీవితం అనే అద్దంలో మనుషులు తమను తాము చూచుకుని అవసరం అనుకున్న దిద్దుబాట్లు, సర్దుబాట్లు చేసుకుంటూ ముందుకు నడవడమే ఏ అంతస్తులోనైనా జరగవలసిన పని.

జీవితంలో ఎవరికి వారికి ప్రత్యక్షానుభవంలోనికి రాని సన్నివేశాలు, సంఘటనలు 'అవాస్తవికం' అనుకోవడం, జీవితదర్శనాన్ని పరిపూర్ణంగా పొందటానికి అవరోధం యేర్పరుస్తుంది.

సమాజంలో అట్టడుగు మనుషులు, వాళ్లను తొక్కి వుంచటానికి ప్రయత్నంచేస్తున్నవాళ్లు మాత్రమే కాదు ఉన్నది. మానవత విలువల్ని ప్రదర్శిస్తూ 'అట్టడుగు' వాళ్లను పైకివచ్చేందుకు చేయూతనిస్తున్న వాళ్లూ వున్నారు. శ్రీమంతుల్లో భావదారిద్ర్యాన్ని, విలువల కొసరులను విదిలించే లక్షణాలను ఎత్తి చూపించే వాళ్లు వున్నారు. సమాజంలో వున్న అన్ని అంతస్తుల వారిని, అన్ని మానసిక స్థితులకు అంటిపట్టుకు వున్నవారిని స్పర్శిస్తుంది కల్పనసాహిత్యం. 'వాస్తవికతల్లో' పొడుచుకువచ్చి పైకి నిలిచే ప్రస్తావనలన్నిటినీ పలుకరించడం, కలబోసుకునే మటకే 'కొత్త పాతల మేలు కలయిక' ని గుర్తించడం అత్యవసరం.

# ఎడిటర్స్ ఎడిటర్ - విలియం షాన్

- కె. సదాశివరావు

ఈ లోకంలో మన స్వల్ప జీవన కాలాల్లో ఎందరో మనుషులు మనకి పరిచయమవుతారు. కొందరు ప్రత్యక్షంగా... చాలామంది పరోక్షంగా ... మనం వూహించలేని విధంగా ఏవేవో దేశాల నుండీ, ఏవేవో కాలాల నుండీ చీల్చుకువచ్చి మన వర్తమాన కాలాన్ని ప్రభావితం చేసి మన జీవితాలను సుసంపన్నం చేస్తారు. ఆ ప్రభావాల పరిధుల్ని బేరీజువేయాలనుకోవడం అసాధ్యం... ఈ వ్యక్తుల్లో ఎందరో మన మానసిక లోకాల్లో దాదాపు దైవాంశాలు సంపాదించుకుని మన ఆలోచనా సమయాలను ఆక్రమించుకుంటారు. ఎందుకో చెప్పలేని విధంగా ఈ వ్యక్తులు మనకి ముఖ్యులైపోతారు... వీళ్ళని కలిసి మాట్లాడగలిగితే... నిజంగానే మనకి వీళ్లు తెలిసి వుంటే!... వాళ్ళతో కబుర్లు చెప్పుకో గలిగితే!... జోక్స్ షేర్ చేసి నవ్వి వుంటే!!... వాళ్ళ జీవిత కాలంలో కొన్ని రోజులూ... గంటలూ.. నిముషాలు... వాళ్ళ సమక్షంలో గడిపితే ఎంత బావుంటుంది!!!

నా దృష్టిలో అలాంటి వ్యక్తులు - మార్క్ ట్వెయిన్, చార్లీ చాప్లిన్, ఆంటన్ ఛెకొవ్, వోడ్ హౌస్, జార్జ్ లూయిస్ బోర్హెస్, హెరాల్డ్ రాస్, బెర్నార్డ్ షా, (గ్రూచో మార్క్స్), బడే గులామ్ అలీఖాన్, పెరల్‌మన్, సెర్ వాంటజ్ మోజార్ట్, రిల్కే, వాల్ట్ డిస్నీ, గురజాడ అప్పారావు... ఇంకా బ్రతికి వుండి 'రెక్లూజ్'లా బ్రతుకున్న రచయిత సాలింజర్, ఓ టాకియాన్‌లా, ఓ క్వార్క్‌లా ఎవరి కంటా పడకుండా రహస్యంగా, అనామకుడిలా జీవిస్తున్న ఈ శతాబ్దపు ముఖ్య నవలా రచయిత థామస్ పించాన్... ఇంకా ఎందరో ...

వీళ్ళలో వొకడైన విలియం షాన్ ఈ మధ్యనే తన 86వ ఏట మరణించాడు. నా దృష్టిలో షాన్ ఎడిటర్స్ ఎడిటర్.

'ది న్యూయార్కర్' వార పత్రికా ప్రపంచంలో ప్రవేశించిన వారికి ఈ శతాబ్దంలో ఈ ప్రపంచంలో సృష్టించిన సాహిత్యం లోకంలోని మహోన్నతమైన రచనలు చేసిన వాళ్లెందరో దర్శనమిస్తారు.

రేచెల్ కార్సన్ పర్యావరణ కాలుష్యం మీద రాసిన ఆక్రోశం లాంటి ''సైలెంట్ స్ప్రింగ్'' మానవాళి కళ్ళు తెరిపించింది. అలాగే ''హిరోషిమా'' రాసిన జాన్ హెర్సీ (ఈ పుస్తకం మొత్తాన్ని ఒకే సంచికలో ఫీచర్స్ యాడ్స్ అన్నీ తీసేసి వేసిన ఘనత షాన్‌దే)... (ట్రూమన్ కెపోటి '' ఇన్ కోల్డ్ బ్లడ్''.... జె.డి. సాలింజర్ కథలు (ఎ పెర్ఫెక్ట్ డే ఫర్ బనానా ఫిష్) జాన్ చీవర్ (కంట్రీ హస్బెండ్) ఇర్విన్ షా (కథలు) జాన్ అప్ డైక్ (కథలూ, సాహిత్య విమర్శ) డొరొతీ పార్కర్, బెర్నార్డ్ మాలా ముడ్ (మాజిక్ బారెల్) డొనాల్డ్ బార్తేల్మ్, రేమండ్ కార్వర్ కథలూ ఓగ్డెన్ నాష్ (అత్యంప్రాసా కవితలూ) డేవిడ్ వాగొనర్, జేమ్స్ డికే, రాబర్ట్ బ్లైవంటి కవుల పద్యాలూ జేమ్స్ బాల్డ్విన్ వ్యాసాలూ, ఎడ్మండ్ విల్సన్ విమర్శలూ, మరో తరంలో బ్రాడ్‌స్కీ, మిలాజ్, కుందేరా, బోర్హెస్, నాడిన్‌గార్డిమర్, మార్క్వెజ్, ఆర్.కె.నారాయణ్, ప్రావెర్ జాబ్‌వాలా శాంతారామారావ్

---

★ **కె. సదాశివరావు గారు** ప్రసిద్ధ కథానిక రచయిత. క్రాస్ రోడ్స్ ఈయన ప్రసిద్ధ కథల సంపుటి.

లాంటి పలు విదేశీయ రచయితల కథలూ, కవితలూ ఈ పత్రికకి ఎనలేని గౌరవాన్ని సంపాదించి పెట్టాయి. నిజానికి రచయితలూ వారి రచనలూ లిస్ట్ వేయాలనుకోవడం అసాధ్యం. అర్వై ఆరేళ్ళ న్యూయార్కర్ పత్రికా గమనంలో ఎందరో ప్రపంచ సాహితీవేత్తలకు అది ముఖ్యవేదిక.

అర్వై ఆరేళ్ళుగా విజయవంతంగా నడుస్తున్న ఓ నగర వారపత్రిక ఒకే పాలసీతో ఇన్ని దశాబ్దాలు నడపడం అంత సాధ్యమైన విషయం కాదని పత్రికలలో సంబంధం వున్న వారికి సులభంగా బోధపడుతుంది. మరి ఈ అసమాన విజయానికి కారకులెవరు?

పత్రికను స్థాపించిన హెరాల్డ్ రాస్ ప్రథమంగా... (జేమ్స్ థర్బర్ రాసిన "The years with Ross" చదివితే రాస్ గురించి బాగా తెలుస్తుంది.) తర్వాత క్రమంలో వచ్చేది దానికి ఎడిటర్‌గా వున్న విలియం షాన్... ఇతడి చేతిలో ప్రతి సంచికా ప్రత్యేక సంచికే !!!

ఈ పత్రికలో విమర్శకులు జాన్ అప్‌డైక్ (సాహిత్యం), ఎడ్మండ్ విల్సన్ (సాహిత్యం), పాలీన్ కెయిల్, పెనెలొపి గిలియట్ (సినిమా), ఎడిత్ ఆలివర్ (డ్రామా).... ఎందరో సూపర్ స్టార్ ఫీజర్ రైటర్స్; అద్భుతమైన కవితలూ, నవ్వించే కార్టూన్స్ (కొరెన్, శాక్సన్, సియర్ల్, షాన్ డే, స్టీన్‌బెర్గ్, ఛాస్ యాడమ్స్ (ఈ కార్టూన్స్ అధారంగా ఈ మధ్య ''యాడమ్స్ ఫామిలీ'' సినిమా వచ్చింది)... ఇంకా .... ఇంకా ... ఎందరో!! ఎందరో!!!

ఈ రచనల్నీ, కవితల్నీ సూపర్ లక్జరీ వస్తువులు - డిబీర్స్ వజ్రాల నగలూ, కార్టియెర్ వాచ్‌లూ, స్టుబెన్, లాలిఖ్ క్రిస్టల్ ఐటమ్స్, టిఫనీ షాపులో లభించే అతి విలువైన గిఫ్ట్‌లూ, షానెల్, క్రిస్టియన్ డియోర్, గివెంచీ, బాలెన్సియాగా ఫాషన్స్, గుచ్చీ లెదర్ గూడ్స్, రోల్స్ రాయిస్, మెర్సిడెజ్, వోల్వో కారులూ, ఇంటర్నేషనల్ స్టార్ హోటెల్స్, వింటేజ్ స్కాచ్, పెర్‌ఫ్యూమ్స్.... మధ్య ప్యాక్ చేసి డాజిలింగ్ పేపర్ మీద ముద్రించి వారం వారం ముఖ్య నగరాల్లోని శ్రీమంతుల డ్రాయింగ్ రూమ్స్‌లో ప్రత్యక్షమవడం ఈ పత్రిక ధ్యేయం.

విలియం షాన్ చికాగో నగరంలో ఆగస్ట్ 31, 1907 లో పుట్టాడు. 1935 లో న్యూయార్కర్‌లో ఎడిటర్‌గా చేరాడు. ఆనాటికి ఆ పత్రిక పుట్టి ఎనిమిదేళ్ళయింది. 1939 లో మేనేజింగ్ ఎడిటర్ అయ్యాడు. తర్వాత మ్యాగజైన్ ఎడిటర్‌గా 1952 నుండి 1987 వరకూ.... రిటైర్ అయ్యే వరకూ పనిచేశాడు.

ఈ తేదీలు చూస్తే ఆశ్చర్యకరమైన విషయాలు తెలుస్తాయి. ఒక వ్యక్తి ఒకే పత్రికలో 55 ఏళ్ళ అనుబంధంతో హాయిగా జీవించాడనీ, అందులో 35 ఏళ్ళు మేగజైన్ ఎడిటర్ బాధ్యతలు నిర్వహించి ఆ పత్రికని ప్రపంచ పత్రికా రంగంలో, సాహిత్య రంగంలోని అత్యున్నతమైన ప్రమాణాలకి తీసుకెళ్ళి ప్రపంచ సాహిత్యానికే ఎనలేని సేవ చేశాడనీ అర్థమవుతుంది. ఎవరికీ కనిపించని క్రీనీడలా... లో ప్రొఫైల్‌లో తెరచాటు నుండి తన వ్యక్తిత్వాన్ని కాపాడుకుని ఏ మాత్రం పబ్లిసిటీ లేకుండా పనిచేసిన విలియం షాన్ ఓ అపూరూపమైన వ్యక్తి. పత్రిక పేజీల్లో తనదైన మార్క్ పదం కూడా రానీయకుండా ఈ శతాబ్దపు విశ్వ సాహిత్యం మీదా, విమర్శ మీదా, కార్టూనింగ్ మీదా.... తనదైన మాయని ముద్ర వేశాడంటే విస్మయం కలుగుతుంది.

హెరాల్డ్ రాస్ 'ది న్యూయార్కర్' మేగజైన్ ఎలెగెంట్ నగర వార ప్రతికగా 1927 లో

ప్రారంభించాడు. సోఫిస్టికేటెడ్, రిచ్ న్యూయార్క్ సిటీ వాసుల కోసం ప్రత్యేకంగా... ఆపైన ఇతర మహానగర వాసుల కోసం... రాస్ మాటల్లో "This is not a magazine for the Lady from DUBUQUE". మొదటి దశాబ్దాలలో పూర్తిగా అమెరికన్ రచయితలు రాసినవే ఈ పత్రికలో వుండేవి. ఆ తరం వారిలో ముఖ్యులు రాబర్ట్ బెంచ్లీ, క్లారెన్స్ డే, జేమ్స్ థర్బర్, ఫిల్లిస్ మెక్‌గిన్లీ, డోరొతీ పార్కర్, రింగ్ లార్డ్‌నర్, విలియం సారొయాన్, డామన్ రన్యన్. థర్బర్ కార్టూన్లు కూడా గీసేవాడు. ఓ అమెరికన్ నగర పత్రిక నుండి అంతర్జాతీయ సాహిత్య వార పత్రికగా రూపాంతరం చెందడానికి ఎన్నో దశాబ్దాలు పట్టినది వాస్తవమే. ఈ మార్పులు పూర్తయ్యే నాటికి ఈ మేగజైన్ ఇంటర్నేషనల్ లిటరరీ టాలెంట్‌కి పెర్ ఫెక్ట్ షోకేస్ అయింది. అంధ ఇండియన్ రచయిత వేద్ మెహతా ఇందులో ఎడిటర్. అతని రచనలన్నీ ఇందులోనే పబ్లిష్ అయ్యాయి.

ఈ పత్రిక పేజీల్లోకి వెళ్ళే ప్రతిమాటనీ షాన్ కనీసం మూడుసార్లు చదివేవాడు. ఆ మాటల్ని తనదైన ఫక్కీలో మార్చేసి ఓ మాంత్రికుడిలా తన ప్రభావం ఏమాత్రం కనిపించనీయకుండా, రచయిత ప్రతిభ పెరిగేలా చేసి పేజీల్లోంచి తాను మాయమయ్యేవాడు.

జాన్ అప్‌డైక్ మాటల్లో షాన్ "a prodigious consumer of information and culture, he retained what he had absorbed, all the tides that had washed through his eyes and ears had polished his own cultural vocabulary to gnomic minimalism. Beneath a reserve that borders on diffidence, he harboured an intensely creative and uncompromising nature."

తాను ఎడిటర్‌గా వున్న కాలంలో షాన్ ఎందరో యువ రచయితలు, కవులు, కార్టూనిస్టులు, విమర్శకులు, ఫీచర్ రైటర్స్‌కి ప్రోత్సాహమిచ్చి వాళ్ళు వెళ్ళవలసిన ఎత్తులకి ఎదగడానికి దోహదం చేశాడు. టాలెంట్ వుండి తమ ప్రతిభ మీద తమకే నమ్మకం లేని వారికి వెన్నుతట్టి వారితో అద్భుతమైన సృజనాత్మక కృషి చేయించి వాటిని తన పత్రికలో సగర్వంగా సర్వ ప్రపంచం ముందుంచి సానపట్టడం షాన్‌కే తెలుసు. స్వాప్నిక జీవులైన రచయితలూ, చిత్రకారులూ, క్రియేటివ్ బ్లాక్స్‌తో బాధపడుతుంటే, వైవాహిక సంబంధమైన సమస్యలతో సతమత మవుతున్నప్పుడూ, ఎమోషనల్ ప్రాబ్లమ్స్‌తో యాతనలు పడుతున్నప్పుడూ, తాగుబోతులుగా మారనున్న తరుణంలో, జీవితం ఎదురయ్యే ఇతర అసిధారవ్రత సమయాల్లో హృదయ పూర్వకమైన సానుభూతితో వారిని ఆదుకునేవాడు. పసివాళ్ళలాంటి ఆ సెన్సిటివ్ క్రీచర్స్‌కి కావలసింది - సింపతీ, ఎంపతీ, దయ నిండిన మాటలూ, ప్రేమాదరణలూ... షాన్ వాటిని సమృద్ధిగా పంచి ఇచ్చేవాడు.

## అతడు అందరికీ మిస్టర్ షాన్.

స్వభావ సిద్ధంగానే రచయితలలో వుండే న్యూరోటిక్ అవసరాలు... ఈ ప్రపంచాన్ని తమ కళ్ళతో చూసి తమ మేధతో అర్థం చేసుకుని, తమ రాతలతో, గీతలతో ప్రత్యేక ప్రపంచాల్ని ఆవిష్కరించాలనుకునీ ప్రత్యేకమైన దృక్పథాలతో తమ వ్యక్తిత్వముద్రలతో రాస్తూన్నప్పుడు తమ వ్యక్తిగత ప్రెజుడిసులతో వారిలో జరిగే నిరంతర అంతర్యుద్ధపు ప్రభావాలు వారి రాతల మీద వుంటాయనీ షాన్‌కి తెలుసు. రచనల్లో ఓ కామా వాడటం వల్లా, ఆగని మాటల వరసలో ఓ పాజ్.

ఇచ్చే ఎమోషనల్ ఇంపాక్ట్ వల్ల పాఠకుడి మనసులో నాటుకుపోయేలా, మంత్రలోకపు రహస్యద్వారాలు తెరుచుకుని చిత్రానుభూతులు కలిగేలా, నూతన రియాలిటీస్ స్ఫురించేలా మానవత్వం సర్వశ్రేష్టంగా ఆవాహన చేయవలసిన ప్రక్రియా బాధ్యతలు షాన్‌ను అనుక్షణం వెంటాడేవి. షాన్‌కి మాటలు అంటే ఆలోచనలు... నాగరికత... సంస్కృతీ ప్రతీకలు... డీసెన్సీ... న్యాయపరమైన సమగ్ర సమ ప్రపంచ నిర్మాణానికి అవసరమైనవి మాటలేనని అతడి నమ్మిక. మాటల్లో ఏదో నిగూఢ శక్తి వుంది. ఎవరైనా సామాన్యమైన పదాలనే వాడి వాటితో రసరమ్యపూరితాలైన వాక్యాలను రాసి వాటిని పేరాలలో, పేజీలలో బంధించి అతడి ముందుంచితే మనోహరమైన విశ్వ సంగీతాన్ని వింటున్నవాడిలా అనిర్వచనీయమైన అనుభూతిని పొందేవాడు షాన్. అరుదైన సాహిత్య దృష్టి వున్న జర్నలిస్ట్ కావడం వల్ల సాధారణ వ్యాసాలు కూడా సాహిత్య లక్షణాలైన సెన్సిటివిటీలో, సున్నితమైన భావాలతో అలరారేవి. ఆ విధంగానే అద్భుతమైన జర్నలిజమ్ లక్షణాలైన మాటల పొదుపు, నిబద్ధత, .నిష్కర్ష సాహిత్య ప్రక్రియలలోనికే తెచ్చి తన ప్రభావంతో సాహితీపరాగ సంపర్కంతో కలిపి మార్చి వేసి ఈ రెండు సాహిత్య ప్రక్రియల మీద తనదైన చెరగలేని ముద్రవేశాడు.

అతడు ఎన్నో దశాబ్దాలు ఎడిటర్‌గా వుంటున్నప్పుడు అతడి చుట్టూ వున్న ప్రపంచం మారిపోయింది. చరిత్రలు మారిపోయాయి. యుద్ధాలు జరిగాయి. జనమేధంతో భూమి దద్దరిల్లింది. నూతన సాంకేతిక విషయాలు... నూతన దృక్పథాలూ... ఇవన్నీ కవుల పద్యాల్లో, రచయితల కథల్లో, జర్నలిస్టుల వ్యాసాల్లో, కార్టూనిస్టుల బొమ్మల్లో ప్రతిఫలించి భౌతిక ప్రపంచాన్ని వేరే కళ్ళతో చూచినప్పుడు నూతన భావాలు మన మన మానసిక మానసిక ఆకాశాలలో నవ్య తారకలుగా భాసించాయి. అన్ని ఖండాల నుండీ మరో తరం రచయితలు అవతరించారు. అన్ని భాషల నుండీ... అన్ని దేశాల నుండీ ప్రత్యేక కంఠాలున్న ఈ రచయితల కథల్నీ, కవితల్నీ 'న్యూయార్కర్' ఆదరంతో ప్రచురించింది. కాందిశీక రచయితలూ, తమ దేశాల్లో పుస్తకాలు నిషేధానికి గురి అయిన వారూ (గార్డిమర్).

కార్టూనిస్ట్‌లకీ, కవులకీ, రచయిలకీ మొదటి ఛాయిస్ ఈ పత్రిక. ఇక్కడ త్రిప్పి పంపాకే ఇతర పత్రికలకి పంపడం.

ఎవరో అన్నట్లుగా న్యూయార్కర్‌లో కథలు చదివితే నవ్వైనా వస్తుంది లేదా అవి ఏడిపిస్తాయి. దేశదేశాల్లోని వందలాది కార్టూనిస్టులకు అనుసరణకి అవి మార్గదర్శకాలవుతాయి. ఇది సామాన్యం. అనివార్యమూ.

''ఫ్రానీ అండ్ జోయీ'' పుస్తకాన్ని అంకితమిస్తూ J.D. సాలింజర్ ఇలా రాశాడు. To his "Editor, mentor and (heaven help him) closest friend, William Shawn genius domus of The New Yorker"; lover of the long shot, protector of the unprolific, defender of the hopelessly flamboyant, most reasonably modest of born great artist - editors."

విలియం షాన్ మరణంతో సాహితీ వనంలో ఓ అరుదైన చిరుగాలి వీచి మనోహరమైన సుగంధాన్ని ప్రపంచానికి పంచి ఎటో వెళ్ళిపోయింది.

# రవీంద్ర కవీంద్రుని క్రమగానం - శృతులు, అపశృతులు

- వి. శివలింగం

భారతదేశం ప్రపంచానికి ప్రసాదించిన ప్రముఖమేధావులు సాహిత్యవేత్తలలో ప్రసిద్ధుడు బహుముఖీన ప్రతిభావంతుడు రవీంద్రనాథఠాగూరు. తండ్రి మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూరు పధ్నాలుగురు సంతానం. మగపిల్లలో చివరివాడు రవీంద్రుడు. జననం 1861 మే 6వ తేది. పిల్లల్ని కట్టుబాటుగా పెంచాడు. బాల్యంలో రవీంద్రుడు ఏకాంతవాసి. యింటిలో వున్నా గవాక్షంనుండి చూపు బాహ్యంలోకి పరచుకునేది. ఎందరినో సూక్ష్మంగా పరిశీలించే వాడు చిన్ననాటి అనుభవాలనెన్నిటినో పెరిగాక కథలుగా మలిచాడు. బాహ్య జగత్తుపట్ల అసక్తి. అంతర్ముఖత్వం పట్ల అనురక్తి పెంపొందించుకొన్నాడు. లోకనిరాకరణ వైఖరి కానరాదు. ఇల్లంతా చిత్రకారులూ కవులూ తత్వవేత్తలతో నిండిపోయింది. రవీంద్రుని తాత ద్వారకా నాథఠాగూరు బ్రహ్మసమాజికుడు. సంఘ సంస్కర్త. రాజారామమోహనరాయ్ ఆంతరంగికుడు. తండ్రితో హిమాలయాలకు వెళ్లాడు. మేఘదూతం చదివించాడు. అక్కడ దేవదారువృక్షాలు తపస్సు చేస్తున్న మునులుగా కనిపించాయి. గలగలమని నవ్వుతూ పారే సెలయేరును మునికన్యగా భావించి ముద్దాడాడు. స్కూలు ఎగ్గొట్టేవాడు. పరీక్షకు వెళ్లేవాడు కాడు ప్యాసయ్యేవాడూ కాదు. స్కూలు బయల ఏబాధా బంధము వుండని చోట మనస్సులగ్నమై వుండేది. చిన్న నాడే గీత గోవిందం బంగాళీలో అచ్చయిన పుస్తకం ఎన్నో సార్లు చదివాడు. కాళిదాసు కావ్యాలు చదివాడు చిన్ననాటి నుంచే కవిత్వం రాయడం ఆరంభించాడు. రవీంద్రుని కవిత్వం అంతా సౌందర్యమయంగా రూపొందింది. అతనిని కవిగానే చెప్పకుంటారందరు. గద్యమహాకవి కూడా. రవీంద్రుని రచనలో గద్యశిల్పం పూర్ణంగా విస్ఫారిందంటారు. 1882 లో ఇరవై ఒకటో సంవత్సరంలో ఒక మహత్తరమైన అనుభూతి పొందాడు. అవిషయాన్ని ప్రభాత సంగీతంలో వివరించాడు. సంధ్య తనలోకే వచ్చింది. ఆ తరుణ అరుణావరణంలో మునిగిపోయాడు. విన్నదీ కన్నదీ అంతా తనని అవరించింది. అప్పుడు ప్రపంచాన్ని స్వస్వరూపంతో చూస్తున్నాడు. ఆ స్వరూపం తుచ్ఛంకాదు అది ఆనందమయం. సుందరం. ఇది జొరొసాంకొ ఇంటిడాబామీద పచార్లు చేస్తుండగా సాయం సంధ్యలో కలిగిన అనుభవం. సదరన్ స్ట్రీట్‌లో ఒకసారి ఉదయం వరండాలో నిలబడి చూచినపుడు హటాత్తుగా తనరూపంలోంచి ఒక ముసుగు లేచి పోయినట్లయింది. ఆనంద సౌందర్యం సర్వత్రా తరంగితమయింది. విశ్వలోక ప్రభవిరజిమ్ముతూ తనలో పడింది. ఆరోజే నిర్ఝర స్వప్నభంగం (The awakening of the fountain) కవితరాశాడు.

1883లో మృణాళినీ దేవిని పెళ్ళి చేసుకున్నాడు. వదినగారు, చిన్ననాటి స్నేహితురాలు కాదంబినీ దేవి 1884 ఏప్రిల్19న మరణించింది. ఆమె మరణం గురించిన వివరాలు తెలియడం లేదు. తరవాత రవీంద్రుడు అనేక కవితలు ఆమె చుట్టూ అల్లినవే. అనాతర్కాద్ గురించి ఖనోల్కారాస్తూ Although he had not accepted the flower of love she offered, the sweet perfume of it remained with him always అన్నాడు.

1890 నుండి 1893 వరకు బిన్న పత్రాలురాశాడు. చాలా కథలకు మూలాలు వీటిలో కనిపిస్తాయి. 1891 నుండి కథలు రాయడం ఆరంభించాడు. కావ్యాల్లో కన్నా కథల్లోనే ప్రకృతి పట్ల ప్రేమ, జీవతం పట్ల అభిమానమూ, సామాన్యుల పట్ల సానుభూతి వ్యక్త మౌతాయి. శైశవ మనస్తత్వాన్ని అంత సున్నితంగా చెప్పినవారు కనిపించరు. మానవుల మీద వున్న అభిమానం

---

★ **వి. శివలింగం** కృష్ణా జిల్లా చల్లపల్లి వాస్తవ్యులు. తత్వం, సాహిత్యాలను అబిరుచిగా చదివారు.

శిల్పాన్ని అధిగమించింది. రవీంద్రుని కథాకథనమార్మికతను అర్థంచేసు కొంటేనే గొప్ప కథకుడుగా కనిపిస్తాడు. నాటకాల్లో 'రవీంద్రిక' భాష కనిపిస్తుంది. పాత్రలకు నిజమైన సత్తా లేదనిపిస్తుంది. కవిచేతిలో కీలు బొమ్మలుగా కనిపిస్తుంటారు. ఏదో అపూర్వమధుర రక్తి స్ఫురిస్తుంది కాని అర్థంకాని భావగీతంలావుంటాయి కొన్ని రచనలు. రచనావ్యాసంగమంతా స్వీయాత్మ పరిశీలనగా, స్వగతాలాపంగా వుంటుంది గద్య రచన. అనేక విషయాలు ప్రాచీన సాహిత్యం నుండి ఆధునిక కవిత్వం వరకు చర్చించాడు. కాళిదాసు శకుంతలకు, షేక్స్పియర్ టెంపెస్ట్ నాటకంలోని మిమిరాండాకు వున్న సాదృశ్యాలను తులనాత్మకంగా చర్చించాడు. తెలుగులో వ్యాపిరామిరెడ్డి రాసిన వన కుమారికి మిరాండకు పోలికలున్నాయి.

ఛోకేర్ బాలి (1902) నుండి గోరా (1910) వరకు రవీంద్రుడు ఒక్కో మెట్టు ఎక్కుతూ వచ్చాడు. తాత్త్విక శిఖరానికి చేరుకున్నాడు. గోరా The epic of India in transition అని కృష్ణకృపలాని, ఆధునిక మహాభారతమని మరొకరు. ఇంటా బయటా (1916) ఛార్ అధ్యాయ్ (1934) నౌకాడుబి (1905). 1905లో బెంగాల్లో విప్లవోద్యమం. నవలల్లో ఆనాటి సామాజిక సంఘర్షణల్నీ పరిణామాల్నీ, రాజకీయ వాతావరణాన్ని చిత్రించాడు.

### రవీంద్రుని దృష్టిలో విద్య

1901లో శాంతిని కేతన్ స్థాపించి, తూర్పు పశ్చిమదేశాల పర్యటనలు చేసి, విరాళాలు సేకరించి దానికో విశ్వస్థాయిలో గుర్తింపు తెచ్చాడు. శాంతినికేతనంలో చదవిన వాడంటే ఒక ప్రత్యేక గౌరవం. భారతీయ ప్రాచీనగురుకులాల పట్ల అభిమానం వుంది. విద్య వ్యక్తులకు సంబంధించింది. మనసులోని అజ్ఞానం ముసుగును తొలగించి ఆధ్యాత్మిక బోధ చేయడమే విద్య. మననైతిక భావాలు సుత్తులతో, ఉలులతో చేసేది కాదు. వృక్షాల వేళ్లు భూమిలో పాతుకుని కొమ్మలు ఆకాశంలోకి పరచుకుంటాయి. దీనికి అర్కిటెక్ట్ ప్రణాళిక అవసరంలేదు. శాంతినికేతన్ బ్రహ్మ విద్యాలయం. విద్య పరిపూర్ణత, సమగ్రతలను సాధించడానికి అవసరం. ఠాగూరు శాంతినికేతన్ను ఆశ్రమం అన్నాడు. అక్కడ విద్యార్థులు ధర్మదీక్షను స్వీకరించి, ధార్మిక జీవితాన్ని గడుపుతారు. ఇక్కడ మత కుల ప్రసక్తి లేదు. పిట్టలు మనచుట్టాలు. సంతాల్‌బాలురు సోదరులు. సత్యం అంగడి వస్తువుకాదు. దివ్య చేతన పొందడానికి ధార్మిక బ్రహ్మ చర్యజీవనం అవసరం. మనస్సును బుద్ధిని, ఇంద్రియాలను నిగ్రహించుకోవాలి. తేజోవంతమైన సత్యాన్ని పొందడానికి మౌనధ్యానం కావాలి. బ్రహ్మచర్యం అంటే ఇంద్రియ బంధన కాదు. ఇంద్రియద్వారాలను ఎప్పుడు మూయరాదు. శబ్ద స్పర్శ రూపాదుల ఆనందాలు అతీంద్రియానందాన్ని భరిస్తాయన్నాడు. రవీంద్రుడు జీవన వైవిధ్యాన్ని. సాంద్రతను గుర్తించాడు. విద్య లక్ష్యం భౌతిక బౌద్ధిక రాజకీయ ఆర్థిక మానవుడిని రూపొందించడమే కాదు. నైతిక ఆధ్యాత్మిక పూర్ణమానవుడిగా అవతరింప చేయడం. ప్రపంచం యుద్ధంలో మునిగి వున్నా ఆశ్రమంలో ప్రశాంతం. జ్ఞానం శక్తి నిస్తుంది. ప్రేమ పరిపూర్ణత నిస్తుంది విశ్వమైత్రి శాంతినికేతన్ లక్ష్యం. నూతన సమాజం కోసం, నూతన సంస్కృతి కోసం, మానవ ఔన్నత్యంకోసం కృషి చేశాడు ఠాగూరు. మానవ హృదయాలను ఉన్నత శిఖరానిధిరోహింపచేసే అజరామరమైన మానవ ఆధ్యాత్మికశక్తికి ప్రతీక ఠాగూరు. విశ్వభారతి ఎందరో మహాను భావులను సృష్టించింది.

### రవీంద్రుని కవిత్వం - ఆంగ్లాను వాదాలు

1912లోనైవేద్య, ఖేయ, గీతిస్మాలయ కవితా సంపుటుల నుండి గీతాంజలి అనువదించాడు.

రోథన్ స్టీయిన్‌కు అనువాద ప్రతియివ్వడం, దాన్ని యేట్స్‌కు పంపడమూ, 1913 లో నోబుల్ బహుమతిరావడం జరిగిపోయాయి. రవీంద్రుని రచనల్ని అనువదించిన వారే లేక పోవడం వల్ల నిరాశ పడి తనేస్వయంగా అనువాదానికి పూనుకొని వుండవచ్చు. గొప్ప చూపెట్టాలని మాత్రం కాదన్నాడు. ఏదో భావా వేగం, రసోత్సవంలా అంతస్సులో వుప్పొంగింది. ఇంగ్లీషులో రచనలు చేసే దేశీయులు ఆనాటికే వున్నారు. 'వారి కంటే నేను అల్పుకై వుండొచ్చు, అయినా ఇంగ్లీషు సాహిత్యంలో నాకు స్థానం లభించింది. ఇందుకు నన్ను క్షమించాలి. ఉదారభావంలో నారచనలు స్వీకరించాలి. కాని అనేకులకు ఈ విషయంలో దుఃఖం కలుగుతూంది. నాకు బాగా తెలుసు అని ఇందిరాదేవికి రాశాడు. బెంగాలీలో అవి గీతాలే కావచ్చు. కాని ప్రపంచానికి వచన కవిత్వంలోనే అందించాడు. అనువాదాల్లో దేశీయతను సాధ్యమైనంతవరకు తగ్గించాడు. నిసర్గ నిరలంకార రచన గాను, విశ్వ జనీన భాషలోనూ రాయ గలిగాడు. అందుకే ఆంగ్లేయులను ఆకర్షించ గలిగింది. నోబుల్ బహుమతి రావడంవల్ల గీతాంజలికి మంచి పేరు వచ్చింది. కాని గీతాంజలి కన్నా ఉత్తమ కవిత్వం లేక పోలేదు. తోటమాలి మంచి కవిత్వమే. ఊర్వశి, కృష్ణ శాస్త్రి గారి ఊర్వశిలా ఉహా ప్రేయసికాదు. నిజంగా దేవతా సుందరి అని ఇస్మాయిల్ గొప్ప కవిత్వంరాశాడు. ఇలా ప్రారంభమవుతుంది :

జననివి కావే దుహితవు కావే;
కావు నవోఢవు; సుందర రూపిణి
నందన వాసినిలి అహో! ఊర్వశీ.

ఆంగ్ల గీతాంజలి అభివ్యక్తిలో స్పష్టతను సాధించాడు. ఠాగూర్ ఆంగ్లాన్ని మెచ్చుకున్న ఆంగ్ల కవులు మూర్, రాబర్ట్స్ బ్రిడ్జెస్, ఎర్నెస్ట్ రైస్, సింక్లెయిర్ ఎవ్‌లిన్ అండర్ హిల్, హెన్రీ నెవిన్సన్‌లు. యేట్స్ రొమాంటిక్ ఇరిష్ స్వప్నంనుండి బయట పడలేదు. వీరంతా ఒకే పద్ధతిలో రాస్తున్న వాళ్ళుకారు. ఠాగూర్ సహజ కవితాసాధకుడే. ఠాగూర్ అంతర్జాతీయత, చేతన ఆంగ్ల సాహిత్యంలో తుపానురేపిన సంఘటన. ఇలియట్ మాట్లాడలేదు. ఎజ్రాపౌండు అవమానకరంగా తోసేశాడు. ఠాగూర్‌కు ఆంగ్ల భాష రాదన్నాడు. యేట్స్ బెంగాలీరచనలు బలాక నుండి శేషలేఖవరకు చదివి వుంటే యేట్స్ తరవాత దశలో రాసిన కవిత్వానికి ఠాగూరుకు భేదం లేదని గుర్తించేవాడు.

ప్రాశ్చాత్యుల అభిప్రాయాలు అసూయతో, అజ్ఞానంతో, జాతి భేదంతో కూడినవి పాశ్చాత్యుల సాహిత్యాభివృద్ధి వలన, తార్కిచర్చల ఫలితమే ఠాగూర్‌ను తిరస్కరించడానికి గల కారణం, అనే అభిప్రాయమూ వుంది. 'The child' కవిత ఠాగూరు ఇంగ్లీషులోనేరాశాడు. ఇదొక్కటే కాదు, మొత్తం 26 ఆంగ్ల రచనలకు బెంగాలీ మూలం కనిపించడం లేదంటున్నారు పరిశోధకులు. ఆంగ్ల రచనలు రుషి అయిన కవి ప్రపంచానికి ప్రసాదించిన కానుక. ఠాగూరు ఆంగ్లరచనలన్నింటిని మూడు వాల్యూములుగా సాహిత్య అకాడమీ ఢిల్లీ వారు ప్రచురించడం అభినందించ దగ్గ విషయం. ఆంగ్లంలో వెలువడిన రచనలు చదివితే ఠాగూర్‌కు వున్న జీవితాభిమానం, మానవీయ ధర్మం, మానవీయ కరుణ, చరిత్ర సంస్కృతుల అధ్యయనంలో విశాల దృక్పథం, విశ్వజనీన దార్శనిక దృక్పథం సంకుచితమైన మనస్సుల్లో కొండంత వెలుగును విరజిమ్ముతాయి.

కవిగా డాంటె, మిల్టన్, షేక్స్‌పియర్, గెటే, కీట్సులకు సరితూగ గలడా? నవలా కారు డుగా టాల్‌స్టాయ్, డాస్టో విస్కీ, బాల్జాక్, డికెన్సులతో గాని, కథారచయితగా మపాసా, చెకోవులకు

దీటురాగలడా? అని ప్రశ్నిస్తుంటారు. వాళ్లలాగ epics రాయలేదు రవీంద్రుడు. వస్తు కవిత్వం వర్ణనాత్మక కవిత్వం వచ్చాక మహా కావ్య నిర్మాణానికి అవకాశం లేదు. మిల్టన్ ధోరణిలో రాద్దామనకున్న కీట్సు తన మహాకావ్యాన్ని సగంలోనే విరమించడం ఉదాహరణగా తీసుకోవచ్చు. పాశ్చాత్య కవుల, నవలాకారుల, కథారచయితల రచనలతో రవీంద్రునితో పోల్చడం సరికాదు. పాశ్చాత్య సంస్కృతికి, ప్రాచ్య సంస్కృతికి భేధం వుంది. సమాజంలోని మానవుని విజయవైఫల్యాల్ని సృష్టించడంలో ఎవరికీ తీసిపోడు రవీంద్రుడు. వైవిధ్యంలో ఏకత్వ సాధన రవీంద్రుని ధ్యేయం. బంకిం చంద్రుడు (1838-94) 1888 వరకు హిందూమత పునరుద్ధరణ వాదికాదు. కామ్టె పాజిటివిజం ప్రభావం యువబంకింలో వుంది. జాతీయతా భావంలో భారతీయ సంప్రదాయాన్ని నూతన దృక్పథంతో వ్యాఖ్యానించడానికి పూనుకున్నాడు. కృష్ణ చరిత (1886), ధర్మతత్వం (1888) శ్రీ మద్భగవద్గీత (1901 లో) ప్రచురితమైన రచనలు. భగవద్గీతలో కృష్ణుడు గోపీలోలుడు కాడు. వైష్ణవభక్తుల దేవుడూ కాడు. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ గావించే వీరోచిత పురుషుడు.

ఆ సంప్రదాయంలోని వాడైనా హిందూ మత సంప్రదాయ వాది కాదు, భారతీయ సంప్రదాయ వాది రవీంద్రుడు. భారతీయ సంప్రదాయం విశ్వ జనీనమైనదని రవీంద్రుడు విశ్వసించాడు. విశ్వజనీన స్థాయి చేకూర్చాడు. వైదిక, హిందూ, బౌద్ధ, జైన సంస్కృతులు - భారతీయ సంస్కృతి నాలుగు పాయలుగా వర్ణించాడు. హిందూ సంస్కృతినే భారతీయ సంస్కృతిగా చరిత్రకారులు కొందరనుకున్నారు. చరిత్రను కూడా విమర్శనాత్మక దృష్టితో అధ్యయనం చేశాడు.

జీవిత చరమదశలో చిత్ర కళను అధ్యయనం చేసి అనేక చిత్రాలు గీశాడు. సంగీతంలో రవీంద్ర సంగీతం అనే పేరుతో ఒక కొత్త ఒరవడిని ప్రవేశ పెట్టాడు. ఏ ప్రకియను చేపట్టినా తన దైన ఒక శైలిని ఏర్పరచుకొన్నాడు. రవీంద్రుని రచనలకన్నా రవీంద్రుడే గొప్పవాడు. నా కన్నా నా గురించి తెలుసు కోడం తక్కువ దేనని మిల్టన్ అన్నాడు. 80 సంవత్సరాలు పూర్ణ జీవితాన్ని అనుభవించాడు. 7 ఆగస్టు 1941 లో మరణించాడు. మరణానంతరం శేషలేఖ (Last Poems) ప్రచురణ జరిగింది. 15 పద్యాలు. పి. లాల్, శ్యామశ్రీదేవి దంపతులు ఆంగ్లలోకి అనువదించారు. గీతాంజలి కన్న ఉత్తమకవిత్వం ఇతర రచనల్లో వుంది. సమకాలీన రాజకీయాలకు దూరంగా లేడు. రవీంద్రుని ప్రతిభ సర్వతో ముఖం. ప్రమాదం నుండి కాపాడమని భగవంతుణ్ణి ప్రార్థించలేదు. దాన్ని ఎదుర్కొనే శక్తి నివ్వమని ప్రార్థించాడు.

భగవంతుణ్ణి ప్రేమించే శక్తి నాకుంది. ఎందుకంటే అతణ్ణి తిరస్కరించే స్వేచ్ఛ నాకిచ్చాడు గనుక అన్నాడు.

గురుదేవుడు, మహాత్మాగాంధీలను ఆరాధించడం కాదు కావలసింది. వాళ్లే పరమావధికాదు.. సాహిత్యం, జీవితం కాలాను గుణంగా మారుతూ వుంటాయి. ప్రతీ విశ్వకవిలోను విశ్వజనీనతా, శాశ్వత విలువలూ వుండక తప్పదు. అంధ విశ్వాసంగాని, నిర్లక్ష్యంగాని సత్యశోధనకు అవరోధాలు. విచారణ, విమర్శనాత్మకమైన విశ్లేషణా అవసరం. ఆధునిక రవీంద్రుని రచనల మీద సమగ్ర విశ్లేషణ చేసిన వారు లేరు. జీవితాన్ని ప్రేమించాడు. మృత్యువును కూడా నిర్భయంగా ఆహ్వానించాడు. ఆలోచనా శీలి. ప్రవక్త రవీంద్రుడు, రవీంద్రుని ఆంగ్లరచనలు స్వయంగా రాసినవీ, అనువదించిననవీ వున్నాయి. ఇతర ఆంగ్లరచనలకేమీ తీసిపోవు. ఆంగ్ల రచనలే విశ్వకవిగా గుర్తింపు తెచ్చాయి.

## తెలుగు కవులు - రవీంద్రుని ప్రభావం

1912 జనవరిలో గురజాడ అప్పారావు కలకత్తా వెళ్ళినపుడు, సాధారణ బ్రహ్మసమాజ ప్రార్థనామందిరంలో జరిగిన సభకు వెళ్లాడు. రవీంద్రుడు ఆత్మపరిచయ్ అనే పత్రాన్ని చదివాడు. కవిరాజైన రవీంద్రునికి బెంగాల్ చూపిన మిక్కుటపు పేరూ, పార లేకి భక్తి యేనాడే రాజెరునంటున్నాడు. ఈ సంవత్సరం డిసెంబరులో కలకత్తా వెళ్ళినపుడు నేరుగా ఆయనతో మాట్లాడాడు. కావ్య భాషగురించి ఒక వ్యాసం రాసి పెడతానని రవీంద్రుడు మాటిచ్చాడుకూడా. 1913లో నోబెల్ బహుమతి వచ్చినందువల్ల విదేశాలనుండి తిరిగొచ్చి అలిసిపోయి వెదజల్ల బడిన ఈశక్తుల్ని మళ్ళీ కూడ దీసుకునేందుకు రాయ్‌ఘర్ కొండలకు వెళ్ళ వలసివచ్చిందని వాగ్దానభంగం చేసినందుకు మన్నించమని రాశాడు. రవీంద్రుడు, అప్పటికే గురజాడ అప్పారావు తెలుగుదేశంలో లబ్ద ప్రతిష్టుడు. రాయాల్సిందంతా అప్పారావు (1862 - 1915) అప్పటికే రాసేశాడు.

జనవరి 1915 - 1917 మే వరకు రాయప్రోలు సుబ్బారావు గారు శాంతినికేతన్‌లో చదివారు. బహుమతి సంపాదించిన గీతాంజలి దొరకలేదు. బసవరాజు అప్పారావు గారికి వెస్లీకాలేజి ప్రిన్సిపాలు ద్వారా దొరికింది. చదివి రాయప్రోలువారికిచ్చారు. రాత్రి పగలు జదివారు ఉద్రేకంతో, ఉత్సాంగంతో, అంతా అర్థం కాలేదు. అయినా ఏదో నూతన కావ్య కళాకాంతి ఆవేశించి వచ్చీరాని ఇంగ్లీషులో రవీంద్రునికి ఉత్తరం రాశాడు. రవీంద్రుడు స్వహస్తంతో జాబురాశాడు. you are welcome to Santiniketan Ashram but not as a chela because I never played or play the role of a Guru.

రవీంద్రుని కావ్య వ్యాఖ్యానం మరపురాని ఉపదేశమైందన్నాడు రాయప్రోలు. రాయప్రోలు మీద రవీంద్రుని ప్రభావం వుంది, రవీంద్రుని మహోపదేశం దారి చూపే దీపమయింది. రాయప్రోలువారు 'నాపై రవీంద్రుని ప్రభావం ' అన్న వ్యాసంలో వివరించారు.

1917 - 19 మధ్యకాలంలో అబ్బూరి రామకృష్ణ రావు గారు శాంతినికేతనంలో గడిపారు. వంగ భాషా సాహిత్యాధ్యానంతో బాటు అరవింద, రవీంద్రుల బహుముఖ శేముషీ విశేషాన్ని స్వాయత్తం చేసుకునే ప్రయత్నం కూడా సాగింది. ఆనాటిదే ఊహాగానం. నిరాండంబరతా భావనా బలాలు రెండూ సమపాలున కలిసి బలిసిన మహారచన. రాయప్రోలు వారు తెలుగు కవిత్వాన్ని మలుపు తిప్పారు. భావకవితోద్యమం వారితోనే ప్రారంభమయింది. అబ్బూరి వారు భావకవిత్వంతోను. అభ్యుదయ కవిత్వంతోను గాఢ పరిచయాలున్నాయి రాయ ప్రోలు. అబ్బూరి ఇద్దరూ రవీంద్రుని రచనలను తెలుగులోకి అనువదించారు. వచన రచనలను రాయప్రోలువారు అనువదించారు. తెలుగు కవిత్వంలో రవీంద్రుని ప్రభావం భావకవిత్వంలో ప్రస్ఫుటంగా గోచరించింది. ప్రకృతి సౌందర్యం, మానవీయత, అచేతన వస్తువులను చైతన్యవంతంగా వర్ణించడం. అనుభూతి సాంద్రత. రవీంద్రుని నుంచి తెలుగు కవులు నేర్చుకున్నారు. చలం గారు ఆశ్రమ వాసి అయినాక రవీంద్రుని రచనల్ని తెలుగు లోకి అనువదించారు.

దువ్వూరిరామిరెడ్డి మీద కూడా రవీంద్రుని కవితాచ్ఛాయ పడింది. నోబెల్ బహుమానం వచ్చాక అతని కావ్యాలు భారతదేశమంతటా వ్యాప్తి చెందటం వలన తెలుగు రొమాంటిక్ కవిత్వం ఆధ్యాత్మిక కవిత్వంగా పరిణమించడం మొదలెట్టింది. తత్పరిణామ చిహ్నాలు ఇప్పుడిప్పుడే తెలుగు కవుల రచనలందు పొడకట్టు చున్నవని రామిరెడ్డిగారన్నారు. భారతీయ సాహిత్య సీమలో హిమాలయ శిఖరంలాగ ఆకాశంలోకి పొడుచుకుని పైకి లేచి ఉద్యమానికి ఉత్తమోత్తమ ప్రతినిధిగా కనబడేవాడు రవీంద్రుడని కృష్ణశాస్త్రి గారన్నారు. శ్రీశ్రీకి మాత్రం రవీంద్రుడు నచ్చలేదు. గీతాంజలి కన్నా 'వాడే వీడు' డిటెక్టివ్ నవల గొప్పదన్నాడు. ఆయన సాహిత్యాభిరుచిని రవీంద్రుని

రచనలు సంతృప్తి పరచవన్నాడు. తెలుగు మార్క్సిస్టు కవులు రవీంద్రుణ్ని, అతని కవిత్వాన్ని మెచ్చలేదు. రవీంద్రుని రచనలు ఒక్క గీతాంజలి మాత్రమేనా. ఏమైనా, మార్క్సిస్టులు, వారి మనస్సులు రష్యాకు, ఇతర మార్క్సిస్టుకవులకు అంకితం గావడం వల్ల పాశ్చాత్య కవుల్లో వున్న అసూయ ద్వేషాలు వీరిలోనూ వున్నాయనిపిస్తుంది. శ్రీశ్రీ ఒప్పుకున్నా ఒప్పుకొనక పోయినా శ్రీశ్రీ తెలుగు కవి అయ్యాడు. రవీంద్రుడు విశ్వకవి అయ్యాడు. ఇంకా శ్రీశ్రీ లోనే ప్రాచీన హిందూ పౌరాణిక పదజాలాన్ని కవిత్వంలో ప్రతికూలంగా నైనా ప్రయోగించి సంస్కృతి అభిమానాన్ని చాటుకున్నాడనిపిస్తుంది. గురజాడను కమ్యూనిస్టులు చేర్చుకున్నారు అందుకే గురజాడ మహాకవి. శ్రీశ్రీ శిష్యులు మహాకవి అని శ్రీశ్రీని జెండా ఎగరేశారు. రవీంద్రుడు మహాకవి అనడానికి వామపక్షీయులు ఒప్పుకోరు. రవీంద్రుడు 1930 లో ఆక్స్‌ఫర్డులో యిచ్చిన ఉపన్యాసాలు The religion of Man, 19933 లో కలకత్తా విశ్వవిద్యాయంలో మానుషేర్ ధర్మ ఉపన్యాసాలు, ఆంధ్రాయూనివర్సిటీ 1933లో Man ఉపన్యాసాలతో సరితూగ గల వ్యాసం గాని ఉపన్యాసంగాని, మన మహాకవి శ్రీశ్రీ రచనల్లో కనిపించదు, ఒక్కటి కూడా. రవీంద్రుడు ప్రకృతి సౌందర్యయోగి. రాలిన ఆకులలో నిశీథపు నిశ్శబ్దంలో ఎడారిదాహంలో మారుతపునిట్టూర్పులలో జగత్తంతా వ్యాపించి ఉన్న చైతన్యపు చలనాలు గుర్తించగల మహాతపస్వి అని శ్రీ పాదవారన్నారు. అనిబద్ధకవిత్వం రాశాడు రవీంద్రుడు. బెంగాలీలో కాదు. మనకు ప్రపంచానికి అందించిన ఆంగ్ల రచనల్లో. శ్రీశ్రీ కావ్యాలలో ప్రతి detail ప్రెంచి సింబాలిస్టులది. అతని inspiration వారిది అని ఇస్మాయిల్ తీర్పు. వామ పక్షీయులు విదేశీయుల నైనా అనుకరించి వాళ్లు గొప్పవాళ్ళంటారు గాని, మంచి కవిత్వం రాసిన దేశీయుల్ని వారిది కవిత్వం కాదు పొమ్మంటారు. అందు నా మన తెలుగు కవులు మరీను. నన్నయ ఏముహూర్తాన అనువాద కవిత్వం మొదలెటాడో గాని ఆ సంప్రదాయం తెలుగు వారి ప్రాంతీయ కళ అయిపోయింది. శ్రీశ్రీ అందుకు వెలి గాదు.

శ్రీశ్రీ రవీంద్రుణ్ణి ఎందుకు కవిగా అంగీకరించ లేదో మనస్తత్వ శాస్త్రం దృష్ట్యా పరిశీలిస్తే బాగుంటుంది. తెలుగులో రవీంద్రుని రచనల అనువాదాలు చాలా వచ్చాయి. బెజవాడ గోపాలరెడ్డి గారు రచనలన్నీ తెలుగులోకి తీసుకువస్తున్నారు. చాలామంది అనువదించారు ఎవరిక నచ్చినవివారు రవీంద్రుని రచనల ఆధారంగా కవిగా, చిత్రకారుడుగా, సంగీత కళాకారుడుగా, రాజకీయవేత్తగా, చరిత్రకారుడుగా, తాత్వికుడుగా విభిన్న దృక్కోణాలనుండి పరిశీలించి విచారణ చేసి నిగ్గు తేల్చాలి. అటువంటి గ్రంథాలువచ్చి నప్పుడు రవీంద్రునికి న్యాయం జరుగుతుంది. కవిని ఆరాధించామా చచ్చిపోతాడు.

పోస్టాఫీసు నాటకం అంతంలో అమల్ అనేకుర్రవాడు మృత్యుశయ్యపై ఉండగా నేపథ్యంలో పాడేందుకు ఒక పాట రవీంద్రుడు రాశాడు ఆ ప్రదర్శనం జరగలేదు. ఠాగూర్ కోరిక పై శాంతినికేతన్‌లో జరిగిన అంత్యక్రియలలో ఆపాటమొదటి సారి పాడారు.

ముందున్నది శాంతి సాగరం<br>
పడవ నడుపు కర్ణధారీ<br>
భవబంధాలు రాలిపోనీ<br>
విశాలవిశ్వ మతాన్ని ఒడిలో తీసికోనీ<br>
తన నిర్భర హృదయంలో<br>
మహా అజ్ఞాతాన్ని తెలిసికోనీ

ఠాగూర్ ఆధునిక లియోనార్డొ డావిన్సీ అన్నాడు శ్రీనివాస అయంగార్, ప్రేమ, సత్యం, శివం, శక్తి — వీటన్నిటి సమ్మేళనమే సౌందర్యంగా భావించాడు రసమయ జీవి రవీంద్రుడు.

# వెయ్యి నవలల కొవ్వలి

– మధురాంతకం రాజారాం

బహుశా 1974లో కావచ్చు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో కర్నూలు పట్టణంలో ఒక సాహితి సదస్సు జరిగింది. అందులో తెలుగులో నవలా సాహిత్య వికాసాన్ని గురించి పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు ప్రసంగించారు. సాహిత్యనెమిశారణ్యంలో కొత్తపురాణాలు విప్పడంలో చతురులైన శర్మగారి ప్రసంగంలో అంతవరకెవరూ స్పృశించని కొత్త విషయం ఒకటి ప్రస్తావనకు వచ్చింది.

''తెలుగు నవలా సాహిత్యాన్ని గురించి మాట్లాడేవారు 'కొవ్వలి' పేరు ఎందుకు విస్మరిస్తారో నాకర్థంగాదు. నా చిన్నతనంలో ఏవైనా కొత్త పుస్తకాలు చదవాలన్న ఆసక్తి గలవారి ఇళ్లల్లో మచ్చులపైన, అలమరాలోపల ఇంకా చాటున మూటున కొవ్వలి నవలలు నిక్షిప్తమై వుండేవి. పెద్దవాళ్లు ఎంతగా నిగాపెట్టినా, ఎన్నెన్నో ఆంక్షలు విధించినా పడుచుప్రాయం వాళ్లు, నాటితరంవాళ్లు ఈనవలల్ని తెగచదివేవారు. కాలేజి స్టూడెంట్లు పాఠ్యపుస్తకాలలో వుంచుకుని వెళ్లేవారు. చదివినవారు నవలను కథగా పదిమందికి చెప్పేవారు. అంతెందుకు? కొత్త పెళ్లికూతుళ్లు తమ పెట్టెలోని పట్టుచీర మడతల్లో కొవ్వలి నవలలుంచుకుని అత్తగారింటికి వెళ్లేదారు.'' అన్నారు శర్మగారు.

పురాణం వారు ఆమాటన్నాక అప్పటివరకు కొవ్వలి నవలలకు సాహిత్యగౌరవం లేదేమోననుకున్న వాళ్లందరూ పునరాలోచనకు పాల్పడవలసిన అవసరం ఏర్పడింది.

సన్నివేశాల్లో నాటకీయత, ఆసక్తి దాయకమైన కథా కథనం, సున్నితమైన హాస్యం, సజీవ వ్యావహారిక శైలి, నిత్యజీవితంలో ఎదురయ్యే మనుషులతో సరిపోవు దగ్గపాత్రలు, సమాజశ్రేయస్సుకు దోహదంచేసే సందేశం - ఈ లక్షణాలను బట్టిచూస్తే కొవ్వలి నవలల్ని నిస్సందేహంగా మంచి సామాజిక నవలలుగా పేర్కొనవచ్చు.

నవలాసాహిత్యాన్ని గురించి రాసిన ఒక సమగ్ర వ్యాసంలో ప్రసిద్ధ సాహితీ విమర్శకులు ఆర్. యస్. సుదర్శనంగారు '1940-45 సంవత్సరాల్లో చలం ప్రభావం తెలుగు నవలపైన ఎంత విరివిగా ప్రసరించిందో గ్రహించడానికి అప్పుడు పుంఖాను పుంఖంగా వచ్చిన కొవ్వలి, జంపన, పట్నాయక్‌ల రచనలు తార్కాణం. పెంకి పిల్ల, ముద్దుల మర్మం, మూడేముద్దులు, నేనెవరి భార్యను, నీవే నాభార్యవు వంటి శీర్షికలతో ఈ నవలలు చలం నవలల్ని అనుకరించాయి' అన్నారు. వెంటనే 'సిద్ధాంతపరంగా గాదు, మధ్య తరగతి సంసారాల్లో కుళ్లునీ, వెకిలితనాన్ని చిత్రించడంలో' అంటూ సవరణ గూడాయిచ్చారు. ' ఈ నవలలు వ్యావహారిక శైలికి ప్రాచుర్యానిచ్చాయి' అనిగూడా పేర్కొన్నారు.

కొవ్వలి, జంపన, పట్నాయక్ అన్న పేర్లకు కృత్తివెంటి, వంటెత్తు అన్న పేర్లుగూడా కలుపుకోవడం సముచితంగా వుంటుంది. ఈ అయిదుగురు నవలారచయితలూ ఇంటి పేర్లతోనే ప్రసిద్ధులు. కొవ్వలి (లక్ష్మీనరసింహారావు) జంపన (చంద్రశేఖరరావు) మానాపురం (అప్పారావు పట్నాయక్) కృత్తి వెంట (వెంకటేశ్వరరావు) వంటెత్తు (వెంకటస్వామినాయుడు)

వీటిని రైల్వే నవలలుగా చెప్పుకోడం అప్పట్లో పరిపాటి. రైలు ప్రయాణాల్లో కాలక్షేపం కోసం చదువుకునే నవలలనే అంతర్యం. ధరను బట్టి విలువైన కాగితం ఉపయోగించే అవకాశంలేదు. అట్టగూడా నాసిరకంగానే వుండేది. రెండో పేజీలో రచయిత ముందుమాట వుండడం పరిపాటి. మూడో పేజి నుంచీ నవల ప్రారంభమైపోయ్యేది. 64 నుంచీ 80 పేజీల దాకా పరిమితి. విడి ప్రతిపావలా రూపాయకైతే అయిదు, టోకుగాకొంటే డజను నవలలు రెండు రూపాయలు.

మా బంధువుల ఇంట్లో అటకమీద (మొత్తం వందకు లోపుగా) నాలుగు కట్టల పుస్తకాలుండేవి.

★ **మధురాంతకం రాజారాం, ప్రముఖ కథా రచయిత.**

ఆపుస్తక సముదాయానికి 'ఆంధ్ర మాతా గ్రంధాలయ'మని పేరుగూడా. కొన్ని చారిత్రక, అపరాధపరిశోధక నవలలతో బాటు అందులో రైల్వే నవలకే ఎక్కువ. పెద్దల పర్యవేక్షణ నుంచి తప్పించుకుని అవి మాలాంటివాళ్ల చేతుల్లోకి వచ్చే అవకాశాలు ఛాలా అరుదు.

అయితే హైస్కూలు చదువుకోసం పట్నంలో ప్రవేశించిన తర్వాత పేట పేటకు నెలకొని వున్న లెండింగు లైబ్రరీల వల్ల కొవ్వలి నవలలు దొరకడం లేదన్న కొరత తీరిపోయింది. నెలకొక అణా మనదికాదనుకుంటే రోజుకొక పుస్తకం చదివి వాపసు చేయవచ్చు. లెండింగ్ లైబ్రరీల అలమరాల్లో ఈ కాలక్షేప నవలలేక్రిక్కిరిసి వుండేవి..కొండపల్లి వీరవెంకయ్యడిపో, రౌతుబుక్ డిపో, వేంకటేశ్వర పబ్లిషింగ్ హవుస్ (అన్నీ రాజమండ్రివే) మొదలైన సంస్థలు ఈ పుస్తకాలను ప్రచురించేవి.

వరకట్నాల బాధలు, కోడంటికం హింసలు, సవతి తల్లి పెట్టే బాధలు, లోక వంచకుల కపటనాటకాలు, నిరుద్యోగుల యాతనలు, అనేక విధాలుగా దగాకు గురైన అతివల దీనగాథలు, సాంప్రదాయపు చాదస్తాలు, నాగరికత వెంట వ్యాప్తి లోకివస్తున్న కుసంస్కారాలు - ఇలా ఎన్నో సమకాలీన సమస్యలు ఈ నవలల్లో చిత్రించబడేవి.

మరింతగా వస్తువైవిధ్యం తెలియడానికి ఈ క్రింది కొవ్వలి నవలల బాబితా మరింతగా ఉపకరించవచ్చు. అవధరించండి: రాత్రిరాణి, సినిమాపిచ్చి, మళ్లీపెళ్లి, ప్రకార్, పంతులమ్మ, వ్యభిచారిణి, పండుగ మామూలు, మూర్‌మార్కెట్టు, విద్యుద్ద్వారం, పంకజం, పారిజాతం, నడమంత్రపుసిరి, ఫిలింస్టార్, పగటివేషం, మారుతల్లి, ఘరానాతుంటరి, వాలుజడ, రైతుపడుచు, సవతిపోరు, రంగేళీ, టు లెట్, ఇల్లాలు, కొమ్మదానం, మార్కెట్ క్వీన్, డాక్టర్స్‌వైవ్, గళ్లచీర, దైవమిచ్చిన భార్య, వెధవాడవడుచు, మారని రూపాయి, బురఖారాయడు, నసీబ్, మరదలుపెళ్లి, అనాధశరణాలయం....

కొవ్వలి నవల తీరుతెన్నులు తెలియడం కోసం ఒక నవల తాలూకు కథాసంగ్రహం చిత్తగించగలరు. ఈనవల పేరు - సినిమాపిచ్చి.

వైకుంఠం, నీలకంఠం, నిరుద్యోగులు, పరభాగ్యోప జీవులు, సినిమాస్టార్‌ను చేస్తామని వరహాల శెట్టి ప్రాపకంలో వున్న చిట్టెమ్మాయిని ప్రలోభిపెడతారు, పెట్టుబడి గూడా శెట్టి దగ్గరే పెట్టించాలని చూస్తారు. అతడు ఒక పట్టాన ఒప్పుకోడు. ఆమె పేర కంపెనీగా రిజిష్టరు చేయించి షేర్ల రూపంలో డబ్బు దండుకోవచ్చునని, లేదా నలుగురు ఆసాములు ఒక్కొక్కరూ అయిదువేలు చొప్పునవేసుకుంటే ఇరవై వేలతో సినిమా పూర్తయిపోతుందనీ శెట్టిలో ఆశలు ప్రోదిచేస్తారు. పది పదిహేనుమంది కాకినాడ నుంచి బొంబాయికి ఒక జట్టుగా బయల్దేరివెళ్తారు. అద్దెకు స్టూడియో మాట్లాడుతున్నామని, టెక్నీషియన్ల కోసం వెదకుతున్నామని మంచి కథ దొరకడమే తరువాయి అని, నెలరోజులు కాలహరణంచేస్తారు. సినిమా వేషాల కోసం కలలు గంటూ కాకినాడ నుంచి వెళ్ళిన జాబులు ఖాళీ అయిపోతాయి. వాళ్ళని చేరలేక, చిట్టెమ్మ్యా గొంతెమ్మ కోర్కెలు తీర్చలేక వరహాలశెట్టి రాత్రికి రాత్రే పరారై కాకినాడ బండి ఎక్కేస్తాడు. వైకుంఠం, నీలకంఠాల అతీగతీ తెలియదు. చిట్టెమ్మాయి, తదితరులు కాకినాడకు తిరిగి వచ్చేసరికి శెట్టి జబ్బుతో తీసుకుంటూ మంచానికంటుకపోయివుంటాడు.

రచయిత స్వయంగా రాసుకునే ముందు మాటకొక హెచ్చరిక. నవల పేరు - పండుగ మామూలు.

'పార్టీకక్షలతో ఒళ్లు తెలియక సొమ్మును దుమ్ము చేసుకుని, కడకు నిజకుమార్తెను గూడా హత్యగావించబోయిన ఒకానొక పార్టీనాయకుడి జీవితం సంగ్రహంగా నవలలో యిమడ్చబడింది.

ఇందులోని కథ అంతా కల్పితమే! అయినప్పటికీ ఎన్నికల గలాభా, ఓట్లు హడావిడి, అభ్యర్థుల ఖంగారు మొదలైన విషయాలు కళ్లకు గట్టినట్టుగా కనబడతాయి.

కాంగ్రెసు విజయానికి.నిజప్రాణాలను సైతం తృణ ప్రాయంగా ఈయబోయి, మహిళా మండలి కాదర్శ ప్రాయురాలైన ఒక స్త్రీ రత్నము యొక్క త్యాగగుణము, ఆమె వికలాంగి

అయినప్పటికీ తొల్లింటి వాగ్దానాలననుసరించిన్నీ, ఆమెయొక్క సుగుణ సంపదను ప్రేమించిన్నీ ఆమెనే వివాహమాడి, తరించిన ఒక ఉదారగుణవంతుణ్ణి చదువరు లీనవల్లో చూడగలరు, ఇట్లు, లేఖకుడు?

కొవ్వలిశైలి : ('పుకార్' అనే నవల ఇలా ప్రారంభమవుతుంది)

'అమ్మా!. వాళ్ల జానకమ్మకు కార్యామంటే ! మొగుడెంత బాగుంటాడనుకున్నావు! నేను ప్రొద్దుట చూసాను.''

- అని బంగారమ్మ తన ముఖంలోకి చూచుకుంటూ వెనకాల తనకు జడ అల్లుతూకూచున్న తల్లితో అంటే ఆమె ఒక్క నిట్టూర్పువిడిచి,

' ఔనుతల్లీ! మనలను గూడా పిలుస్తారు. మనం పేరంటాని వెళ్లడమెందుకు అని బంగారమ్మ తల్లి సుందరమ్మ అంటుండగా ఇంతలో అయిదారుగురు ముత్తైదువలు బెనారస్ చీరలతోను, బంగారు ఆభరణములతోను వచ్చి ఆతల్లీ కూతుళ్లిద్దరి ముఖాన కుంకుమ రేఖలను దిద్దారు.

'మా చెల్లెలికి ఈ రాత్రికి కార్యం, సాయంత్రం పేరంటానికి, రాత్రి భోజనానికి మీరురావాలి'. అని అందులో ఒక ఆడుపడుచు చిరునవ్వు ముఖంతో అని తోటివారితో వెళ్లి పోయింది.

బంగారమ్మకెన్నడో పెళ్లయింది. రజస్వలై మూడేళ్లయింది. భర్త అత్తగారింటివైపు తిరిగిమళ్లీ చూడలేదు. పాపం, ఆ తల్లీ కూతుళ్లు ఆహ్వానాన్ని ఎలామన్నించగలరు?

అల్లుడితో మాట్లాడి రావడానికి వెళ్లిన ఇంటియజమాని యింతలో రైలుదిగి ఖిన్న వదనుడై ఇంటికి చేరుకున్నాడు. (ఇంతకూ ఏంజరిగింది. అదే సస్పెన్స్)

★ ★ ★

మహాపండితుడు, సాహితీవేత్త. నిడదవోలు వేంకటరావుగారు సాహిత్య సమీక్షకావిస్తూ ఒకచోట కొవ్వలి లక్ష్మీ నరసింహారావు గారిని 'వేయి నవలల కొవ్వలి'గా సంభావించారు. నికరంగా చెప్పలేముగానీ కొవ్వలి కొన్ని వందల నవలలు రాసిన మాటనిజం. అయితే ఏ ప్రాచీన నిక్షేపమైనా చేజారిపోయినతర్వాత మాత్రమే బిక్కమొగం పెట్టే తెలుగువారు కొవ్వలి నవలల్నీ సైతం ఎక్కడా పదిల పరచుకున్నట్టు తోచదు. తిరుపతి శ్రీ వెంకటేశ్వ విశ్వవిద్యాలయ ప్రాచ్యభాషా గ్రంథాలయంలో ఈయన నవలలు దాదాపు నాలుగు డజన్ల దాకా కనిపిస్తున్నాయి. వేటపాలెం, రాజంద్రి గౌతమీ గ్రంథాలయం, హైదరాబాదు శ్రీకృష్ణ దేవరాయ భాషా నిలయం మొ॥చోట్ల మరికొన్ని నవలలు దొరకవచ్చు.

కల్పనా సాహిత్యం గ్రాంధిక భాషలోనుంచీ వ్యావహారికభాషా శైలిలోకి మారిన ఘట్టంలో అందుకు గణనీయమైన దోహదం చేసిన రచనలుగా కొవ్వలినవలలను గుర్తించాలి. ప్రాచీన సాహిత్యాన్ని తప్పించి, వర్తమానసంబంధించినరచనలు చదువుకోవాలనికోరుకునే అక్షరాస్యులలో పఠనాసక్తిని పెంచిన పుస్తకాల్లో కొవ్వలి నవలలకు ప్రముఖ స్థానం యివ్వాలి. 1935కు-45కు మధ్య తెలుగువారి సామాజిక జీవనాన్ని వెలుగు చీకట్లతో, నిమ్నోన్నతాలతో, సుఖదుఃఖాలతో సమగ్రంగా చిత్రించినకితాబుగూడా ఈనవలలకు దక్కాలి. మనవిశ్వవిద్యాలయాలలోని తెలుగు, సోషియాలజీ పరిశోధనులకు ఇవి తరగని పెన్నిధిలాంటివని గుర్తించాలి.

కొవ్వలిలక్ష్మీనరసింహారావుగారు 1950 ప్రాంతాల్లో సినిమా రంగంలో గూడా కాలుమోపారు. 'సిపాయి కూతురు' అనే ఆయన నవల అదే పేరుతో సినిమాగా రూపొందింది. 'శాంతి' సినిమాకు కథతోబాటు మాటలు గూడా రాసి, ఒక చిన్న పాత్రను గూడా పోషించారు.

(ఈ రంగంలో కొవ్వలితర్వాత మళ్లీ అంతటివారుగా పేరు తెచ్చుకున్న జంపనచంద్రశేకరరావు సినిమా ప్రపంచంలో మరింతగా రాణించారు. రాజ్యం పిక్చర్స్ వారు లక్ష్మీరాజ్యం చంద్రమతిగా, యస్.వి.రంగారావు హరిశ్చంద్రుడుగా తీసిన 'సత్యహరిశ్చంద్ర' చిత్రానికి దర్శకుడు ఈయనే.)

# ప్రతిభావంతంగా పాక్షిక సత్యం

(రాముడుండాడు - రాజ్జిముండాది - కేశవరెడ్డి) — నరేష్ నున్నా

ఎండమావుల దిశగా అనివార్యంగా ఎగిరిపోతున్న వలస పక్షుల బాధామయ గాథ ఈ నవల. పొట్ట చేతపట్టుకొని నాలుగు మెతుకులు దొరికినచోటే జన్మస్థలంగా నిరంతరం వలస ప్రయాణాలు చేసే సంచార జాతుల కథకాదు ఇది. అన్ని దారుల నుండి చేదు తిరస్కారాన్ని చవిచూస్తున్నప్పటికీ అంతులేని జీవన కాంక్ష, మొక్కవోని సమరోత్సాహం నిండిన వలస తెగల కథ కానేకాదిది. 'ఎవరి కులరుత్తులు గిట్టుబాటు' కాని పరిస్థితుల్లో 'తెంపు చెయ్యాల్నే గానీ ఊరిడ్సినంత పుణ్యం లేదు' అని నిర్ధారణకు వచ్చిన బడుగు జీవులకు ఊరు విధించిన అప్రకటిత బలవత్బహిష్కరణలివి.

'బూమ్మీద పడి కండ్లు తెర్చినప్పట్నించి కయ్యాల్లో కూరాడుకుంటూ బతికితి. కయ్యాలలో ఉంటేమన్నే బంగారం అని నమ్ముకోనుంటి' అంటూ ఉన్న భూమిని అప్పుల వల్ల పోగొట్టుకొని పార్లిపార్లి ఏడ్చిన తిరుపాలనాయుడు, 'కంటికి రెప్ప మాదిరి, కాలిని గోరుమాదిరి ఊరిని దేముడు కాపాడాల. ఊరిట్లా కలపడిపోతావుంటేదేముడు ఉన్నట్టా లేనట్టా?' అని, ఆ రాతిబొమ్మకు పూజలు చేయలేక కొలువు చాలించుకున్న పూజారి, గిట్టుబాటు కాని కులవృత్తి బతుకును భారం చేస్తుంటే, కొద్దిపాటి ఆధారమైన కొలిమి రైతుల కోపానికి ధ్వంసమైపోతే, 'రేపట్నుంచి చిప్పపట్టుకొని యాదిక్కుకనిపోవాల. ఎవుని పంచ జేరాల. కీలుకీలూ వొంచి కష్టం చేసినోణ్ణి. యాభై ఏండ్లు వొళ్లు గుల్ల చేసుకొని ఆకిరికి ఈ పొద్దుటికి బిచ్చగాడ్నైతిని' అని దుఃఖించిన కంసాలి, ''ముప్పై ఏండ్లు జీతగాడుగా ఉండి పెదనాయుడికి లక్ష రూపాయలపైగా వరుమానం సంపాదించి పెట్టి. మరి నాకేవి దక్కింది. ఒక జత అడ్డపంచెలు, ముప్పై సంవత్సరాల పొడుగునా ఉత్త పిండి సంగటి. అది తల్సుకుంటేకడుపు దగోత్తరంగా కాలిపోతే వుందిరా. ముప్పై సంవత్సరాలు కండ్లుండీ కబోదినైతి. చెవులుండీ చెవిటోడినైతి. తల్చుకుంటే కడుపు కాలిపోతావుందిరా' అని చిట్టచివరికి మేల్కొన్న కోనిగాడు... అందరూ ఊరు పొమ్మనకనే పొమ్మంటే, కాడు పిలవకనే పిలిస్తే, పుట్టిన ఊరిని విడిచిన వలసపక్షులయ్యారు. అయితే 'రాముడుండాడా, రాజ్జిముండాది' అన్న భరోసా వారిలో ఆరిపోలేదు. అయితే ఆ భరోసా రచయితకు లేదు ( ఉండే వీలు లేదు) కనుకనే 'తారురోడ్డు మీద ఎండమావులు సముద్రపు అలలవలే అవిరామంగా లేస్తున్నాయి. మాయవలే అంతరిస్తున్నాయి' అన్నాడు.

ఆకాశంలో జాబిలి చేరువైన దశ, పేజర్, సెల్యులార్ల ప్రపంచం నానాటికీ దగ్గరవుతున్న దశ ఎవరికి ఆధునికం, ఏ వర్గాలకు అత్యాధునికం అని చిక్కుప్రశ్నలు ప్రత్యక్షంగా వేయడం లేదు రచయిత. ఆకలిని భరించడం అనివార్యమైన వర్గం, దానిపై దోపిడిని కొనసాగించేందుకు అలవాటు పడిపోయిన వర్గం, ఈ వర్గ ప్రయోజనాలను కొమ్ముకాసే రాజ్యం, ఈ వ్యవస్థీకృత దుర్మార్గంలో ఛిద్రమైపోతున్న కులవృత్తులు.... వీటి చుట్టే ఈ కథాంశం అల్లుకుపోయింది. ఈ కథనంలో వ్యక్తమయిన భావం కంటే, అవ్యక్తంగా, అన్యాపదేశంగా స్ఫురించే అర్థం ఎక్కువ. కథకుడే

---

★ **నరేష్ నున్నా**, ప్రముఖ పాత్రికేయులు, హైదరాబాదు.

ఉపన్యాసకుడిలా సర్వం వాచ్యం చేయకుండా నిశ్శబ్దంగా ఎక్కువ మాట్లాడి నవలను మరింత శక్తిమంతం చేయగలిగాడు. ఇది కేశవరెడ్డి శిల్ప నిపుణతకు నిదర్శనం. 'తేనెలో పడ్డ ఈగ తేనె తాగుతూ వృద్ధిచెందిందీ లేదు. సాలెగూట్లో పడ్డ ఈగ ఆ తీగలమీద ఊయల లూగుతూ ఆనందించేది లేదు' అంటూ అప్పు లభించే అసంఖ్యాకమైన వనరుల ఫలితంగా రైతులకు లభించే అసంఖ్యాకమైన వనరుల ఫలితంగా రైతులకు లభించే 'సౌఖ్యం' ఏపాటిదో చెబుతున్నారాయన. ఈ నిష్ఠూర సత్యాన్ని చూడగలిగిన కంటితోనే... పుట్టిన గడ్డను వదిలి పరాయి సీమకు ప్రవాసానికి వెళ్లిపోతున్న వారి మానసికోద్వేగాలు, తల్లినేలతో వారి అనుబంధాలు వెనకనున్న ఉద్విగ్న వాస్తవాన్ని కూడా చూడగలిగారు. హృద్యమైన ఆ తడిదృశ్యాన్ని అక్షరమక్షరమే నింపి ప్రతిభావంతంగా ప్రదర్శించగలిగారు. ప్రజల భాషతో, భావనతో, సంస్కృతితో అంతమమేకం కాగలిగారు కనుకనే ఇది ఆంధ్రదేశంలోని చిత్తూరు జిల్లా మూరుమూల గ్రామం కథగా గాక, మొత్తం దేశమే ప్రతీకాత్మకంగా ఒదిగిన పల్లె గాథగా తోస్తుంది.

అయితే ఏ దేశానికి ఈ గ్రామం ప్రతీకగా నిలుస్తుంది? ఈ ప్రశ్న అర్థంలేదనిదిగా అన్పించవచ్చునేమో. కానీ, ' ఒక గ్రామంలోని వివిధ కులాల అంతస్సంబంధాలను, inter dependencyను చిత్రించిన నవల'గా ఈ నవల గురించి కేశవరెడ్డి చెప్పుకున్నప్పటికీ, అది పాక్షికంగా మాత్రమే వాస్తవం. ఉదాహరణకు కంసాలి కొలిమిని ధ్వంసం చేసిన రైతుల క్రోధం, దౌష్ట్యం వెనక వర్ణాధిపత్యమేగానీ, వర్గాధిపత్యం లేదు. ఇటువంటి విషయాలను కన్వీనియెంట్‌గా దాటవేసిన కేశవరెడ్డి చిత్రించిన ఈ గ్రామం భారతదేశానికి ప్రతీక కానేకాదు. భారతీయ సంస్కృతిలో అవిభాజ్యమైన వర్ణాన్ని ఆయన వర్గం చాటున అణిచివేశారు. కులవృత్తులు నాశనమయిపోవడం వల్ల 'అధోముఖం'గా సమాజంలో జరుగుతున్న వర్గసంకరాన్ని చిత్రించడానికి ఉద్దేశించిన కథా కాన్వాస్‌పైన దళిత సమస్యకు చోటు దొరకలేదనో, జెండర్ వివక్ష గురించి పట్టించుకోలేదనో, మరో సమస్యపై శీతకన్ను వేశారనో తప్పుపట్టడం నిస్సందేహంగా అసందర్భమే అవుతుంది. అయితే, ఈ నవలలో కులసమస్యను గురించి కేశవరెడ్డి చర్చించకపోలేదు. 'కులం' కేవలం ఉపరితలానికి చెందిన సమస్యేనన్న తన వాదనకు మొత్తం నవలనే సాక్ష్యం తెచ్చారాయన. కులసమస్యను ఉద్దేశపూర్వకంగానే అప్రధానం చేసేశారు. చివరకు గ్రామాన్ని విడిచి పుల్లిగాడితో పట్నం వెళ్లిపోయే పాత్రలు పూజారి, తిరుపాల నాయుడు, కంసాలి, కోనిగాడు కావడం యాదృచ్ఛికం కాదు. వీరు నలుగురు నాలుగు కులాలకు చెందిన వారైనా, స్థూలంగా వీరికి కులంలేదని, ఉన్నది ఒకే కులమని- అది ఆకలి కులమని రచయిత అన్యాపదేశంగా (ముందుమాటలో వాచ్యంగా) చెప్పారు. 'గాదెలు, గెరిసెలు నిండి తొణకతా ఉంటే రైతు, కూలోడు అని ఏర్పడేది. అన్నీ కడిగి బోర్లించేసినాక రైతూ ఒకటే, కూలోడు ఒకటే' అంటూ పరాజితుడైన తిరుపాల నాయుడు నోట పలికిస్తాడు కేశవరెడ్డి.

తన మోటివ్‌ను, సైద్ధాంతిక, తాత్త్విక దృక్పథాన్ని నవలలో అంతర్లీనంగా, సూత్రప్రాయంగా వ్యక్తంచేయడంతో ఆగకుండా, 'ముందుగా ఒక మాట' అని ఆ మోటివ్‌ను నేరుగా చెప్పుకోవడానికి రచయిత ఆత్రుతపడ్డారు. 'సమాజంలో ఉన్న అన్ని రుగ్మతలకీ ఆర్థిక అసమానతలే మూల కారణమనీ, దానికి అంతిమ పరిష్కారం వర్గపోరాటమేనని నేను గట్టిగా నమ్ముతాను' అని

చెప్పుకున్నారు. పీడిత ప్రజలను చీల్చే కుట్ర'గా దళిత పోరాటాన్ని బ్రాండ్ చేయకపోయినా, దళితుల సమస్య ప్రధానంగా ఉపరితలానికి సంబంధించినదిగా గుర్తించాలంటున్నారు. అదే సంప్రదాయ సామ్యవాద దృష్టితో కులవృత్తులే కులాలకు మూలమని నమ్ముతున్నారు. 'కులవృత్తులు అంతరించిపోతుండటం వల్ల కులాలు అంతరించిపోయి, నీరు పల్లానదికి ప్రవహించినంత సహజంగా వర్గాలే మిగిలవలసిన తరుణం' లో అలా జరుగకపోవడం గురించి రెండు నిమిషాలు మౌనం మాత్రమే పాటించి, నిరుపేదలందరూ దళితులే అన్న పాత నినాదాన్నే తిరిగి వినదిస్తున్నారు.

'ఇండియాలో తెల్లవాడు వేస్తున్న రైలుపట్టాల మీద ఆ దేశంలోకి పయనించే ఆధునిక పారిశ్రామిక ప్రపంచం అక్కడి అనువంశిక కులవృత్తులను ధ్వంసంచేసి, ఫలితంగా కులాలను రూపుమాపుతుంద' ని జోస్యం చెప్పాడు మార్క్స్. జోస్యం తప్పింది. చరిత్ర పట్ల విధేయ విద్యార్థి అయినప్పటికీ, కార్ల్‌మార్క్స్ భారత దేశ చరిత్రను కూలంకషంగా అర్థం చేసుకోలేక పోవడంలో ఆయనకు ఉన్న పరిమితులను అర్థంచేసుకోవచ్చు. మార్క్సిజానికి పూర్తి oriental ఆలోచనతో మరమ్మతు చేసిన మావో ఇండియాను 'అర్థవలస, అర్థభూస్వామ్య' దేశంగా మాత్రమే దర్శించాడు. చైనా చరిత్రను అయిన ఔపోసన పట్టాడే గానీ, భారత చరిత్రకాదు. కనుక, మావో పరిమితులను అర్థం చేసుకోవచ్చు. అయితే, వారిరువురూ సంయుక్తంగా అందించిన సందేశం మరొకటి ఉంది. అదేమంటే, ఎవరి మాతృదేశం గురించి వారు క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలని, చరిత్ర చెప్పే పాఠాల ఆధారంగా ముందడుగు వేయాలన్నదే వారి సందేశం. ఆర్థికంగా, సాంస్కృతికంగానే కాదు, మేథోపరంగా కూడా మన దేశం కడు పేద దేశం. ఆ మేథోదారిద్ర్యం వల్లనే 'పీడిత, తాడిత' అనే అరువు మాటలతో దాదాపు శతాబ్దకాలం పొద్దుపుచ్చారు ఇక్కడి మార్క్సిస్టు ఆలోచనాపరులు. అంతేగానీ సమస్యను అర్థంచేసుకునే ప్రయత్నం మాత్రం శూన్యం.

భారతదేశానికి తప్ప ప్రపంచ పటంలో ( జపాన్‌ను మినహాయిస్తే) కులమనే విపరీత జాడ్యం సోకిన దేశం మరొకటి లేదు. నాలుగైదు వేల సంవత్సరాలుగా చదువు, సంస్కారం, అవకాశం, వాణిజ్యం.... ఇత్యాదులు కొన్ని ప్రత్యేకమైన కులాలకే పరిమితమైన దుర్భర పరిస్థితులు మరెక్కడా లేదు. రెండువేల సంవత్సరాలకు పైగా బానిసత్వంలో మగ్గి, పరపీడనను అనుభవించి కూడా ఆ గాయాల చరిత్ర నుంచి ఏ విధమైన పాఠాల్ని నేర్చుకోని బడుగు జాతి మనది. పదే పదే మనం బానిసలమయ్యాం. విదేశీయుడు నిరంతరం విజేత అయ్యాడు ( అవుతున్నాడు). ఇంగ్లాండులో 500 సంవత్సరాల కాలంలో క్రూర రాచరికాలకు వ్యతిరేకంగా 4 సార్లు తిరుగుబాట్లు జరిగాయి. కానీ, రెండు వేల సంవత్సరాల భారతదేశ చరిత్రలో ఎక్కడా విప్లవం తలెత్తలేదు. స్వాతంత్ర్యానంతర దశ అయిన ఇప్పుడు కూడా దాదాపు 80 శాతం ప్రజలను అంతర్గత పోరాటాల పట్ల నిర్లిప్తంగా ఉంచేసిన మహాశక్తి - 'కులం'. 'వర్గపోరాటమ'నే ఎంగిలి మాటలు మాట్లాడే ముందు, ఏ పోరాటానికీ సమాయత్తం కాలేని మెజారిటీ భారతీయాత్మలో ఉన్న ఆత్మన్యూనత వేర్లు ఎక్కడివో అన్వేషణ జరపవలసిన బాధ్యత సామ్యవాదులది. కానీ, ' ఈ సమస్య ఉపరితాంశం మాత్రమే' ననడం దగ్గరే ఆగిపోతున్న భారత మార్క్సిస్టు రచయితలలో కేశవరెడ్డి మొదటివారు కారు. చివరివారు అంత కన్నాకాదు.

కులవృత్తుల విధ్వంసాన్ని ప్రధానాంశంగా ఈ రచన చేసిన కేశవరెడ్డి భారతదేశంలోని వేలాది కులాలకు కులవృత్తులు మాత్రమే మూలం కాదన్న మౌలిక విషయాన్ని అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. భారతదేశ చరిత్రను నిశితంగా గమనిస్తే, వర్ణ, వర్గాలలో అధో, ఊర్ధ్వ చలనాలు అర్థమవుతాయి. వర్గాలలో పరివర్తన, స్థాన చలనం కొద్ది మోతాదులోనైనా ఉంటుంది. సాపేక్షంగా చూస్తే, ఆ మాత్రం చలనానికి కూడా వర్ణం నోచుకోదు. వర్ణం చలనశీలమైతే వర్గంగానూ, వర్గం జడమైపోతే వర్ణంగానూ రూపాంతరించడంలోనే భారతదేశంలోని కులాల పుట్టుక రహస్యముంది. వర్ణం చలనశీలమైతే వర్గంగా రూపాంతరించిన పరిస్థితులకు తమిళనాడులోని మొదలియార్లు, కేరళలోని ఈళవ కులాలను ఉదాహరణగా చెప్పుకుంటే, వర్గం జడమైపోయి వర్ణంగా స్థిరపడిపోయినదానికి యావత్ భారతదేశంలోని అస్పృశ్యులను ఉదహరించుకోవచ్చు. ఇంకా మూలాలలోకి వెళ్ళితే, పరాజితులను సర్వనాశనం చేయడం కంటే, వారి ఆదాయాలను, అధికారాలను కట్టడి చేస్తూ, ఆ కట్టడి న్యాయబద్ధమైన హద్దుగా 'కులం' పేరిట నమ్మించడంలోనే వేలాది కులాల, ఉపకులాల పుట్టుపూర్వోత్తరాలు ఉన్నాయి. పరాజితుల విశ్వాసాలను సంస్కృతిని సమాధిచేయకపోవడంలోనే భారతీయ చరిత్రయొక్క uniqueness దాగుందని సాంప్రదాయ వాదులు కీర్తిస్తారు. ఆ కీర్తనలను రెండో ముఖాన మనకి వర్ణాల పుట్టుపూర్వోత్తర రహస్యం దొరుకుతుంది.

కనుక కులవృత్తులు సమసిపోతే కులాలు పోతాయని 19వ శతాబ్దపు మధ్యంలో మార్క్స్ అపోహపడితే పరవాలేదు కాని, 21వ శతాబ్దం ప్రారంభంలో కూడా అదే అపోహకు గురైతే ఎలా? 'రాముడుండాడు రాజ్జివుండాది' తొలి ప్రచురణ జరిగింది 1986లో. కేశవరెడ్డి అప్పుడు 'ముందుగా ఒక మాట' చెప్పుకొని ఉన్నట్లయితే దళిత సమస్య పట్ల ఆమాత్రం consideration కూడా చూపగలిగేవారుకాదేమో. కనుక సామాజిక శాస్త్ర అవగాహన బాగా తక్కువగా ఉన్న తెలుగునేలపై బహు ఆలస్యంగా కళ్ళు తెరచిన దళిత వాద స్పృహ కేశవరెడ్డి వంటి రచయితలలో ఆపాటి concern కు కారణమవటం సంతోషదాయకమే.

ఇక 'టెక్ట్స్', 'వర్క్'ల నుండి బయటకు వచ్చి ఇదే నవల వెనుక ఒక retrospect గా ప్రచురితమైన వ్యాసాల దృష్ట్యా కేశవరెడ్డిని గమనిస్తే ఈ పుస్తకం మలి ప్రచురణకు ఒక నిర్దిష్టమైన ఉద్దేశ్యం ఉందేమో నన్న అనుమానం కలుగుతోంది. 'నేను మార్క్సిజానికే దూరం అయ్యానని ఎందుకు అనుకుంటున్నారు. నేను మార్క్సిస్టునే. 'అతను అడవిని జయించాడు' 'మూగవాని పిల్లనగ్రోవి' ఒక ఫిలాసఫీకి చెందినవి. అంతమాత్రాననేను మార్క్సిస్టును కాకుండా పోతానా' అని ఎదురు ప్రశ్నిస్తూ 'సుప్రభాతా'నికి గత ఏడాది ఇచ్చిన ఇంటర్వ్యూను ఈ పుస్తకం చివరిలో ప్రచురించారు. తానెంత మార్క్సిస్టో, పదకొండేళ్ళ నాటి భావాలు ఇంకా తనలో ఎలా 'చెక్కుచెదరకుండా' నిలిచి ఉన్నాయో నిరూపించడమే పుస్తకం మలి ప్రచురణ ఆంతర్యం అనిపిస్తుంది. సామ్యవాద శ్రీశ్రీ 30లలో చేసి 'ప్రతిజ్ఞ' శకలాన్ని, కరడుగట్టిన మార్క్సిస్టు మేధావి వరవరరావు ముందుమాట వీటికి తోడుగా తానే స్వయంగా 'వర్గపోరాట' ఆవశ్యకతను వివరిస్తూ రాసుకున్న ముందుగా ఒకమాట కేశవరెడ్డి ఆంతర్యాన్ని పరోక్షంగా బలపరుస్తున్నాయి. నాయీ అనుమానమే నిజమైతే తెలుగుదేశానికి మిగిలిన ఇద్దరు నవలా రచయితలు పతంజలి, కేశవరెడ్డిలలో రెండవ రచయితను కూడా మనం కోల్పోయినట్లే.

# నేనెరిగిన డా. సి. ఆర్. రెడ్డి

ఇంగ్లీషు మూలం : కె. శంకరానందం  తెలుగు అనువాదం : ఘట్టమరాజు

నేను ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వైస్ - ఛాన్సలర్ డా. కట్టమంచి రామలింగారెడ్డి గారి ఆప్తకార్యదర్శిగా 1947 ఆగష్టు 8వ తేదీన ఉద్యోగంలో చేరాను. ఉద్యోగం రావడమూ, అందులోనూ డా. సి. ఆర్. రెడ్డి గారి లాంటి మహానీయుని సేవించే అవకాశం లభించడమూ నా అదృష్టం కాకపోతే మరేమిటి? ఆయన ఆంతరంగిక కార్యదర్శిగా పని చేసిన ఆరోజులు ఎన్నటికీ మరిచి పోలేనివి.

భారతదేశానికి స్వాతంత్ర్యం రావడానికి ఇంకా కొన్ని రోజులే ఆలస్యం. భారతదేశ చరిత్రలో మహత్తరమైన మలుపు తిరుగుతున్న క్షణాలు! అందరి మనస్సుల్లో ఏదో ఉత్కంఠం! ఉద్విగ్నత! ఆవేశం! ఒకటి తర్వాత 'మరొకటిగా' ఘటనలు, దుర్ఘటనలు గబగబా సంభవించాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించడం, దేశవిభజన సందర్భంగా ఢిల్లీ, పంజాబ్, లాహోర్ ప్రాంతాల్లో మారణహోమం, జాతిపిత గాంధీజీ హత్య, కాశ్మీరు సమస్య ---------- ఎన్నో -------- ఎన్నెన్నో ఊహాతీతఘటనలు వెనువెంట జరిగిపోయ్యాయి.

1947 డిసెంబరు చివరి రోజులు ఒరిస్సాలోని కటక్‌లో ఇంటర్ యూనివర్శిటీ బోర్డు సమావేశం జరిగింది. డా. సి. ఆర్. రెడ్డిగారి వెంట 'గోవు వెంట తగులు కోడె భంగి' నేనూ వెళ్లాను, సమావేశం జయప్రదంగా ముగిసింది. కొత్తగా ఆవిర్భవించిన ఉత్కళ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ ప్రసంగం చేశారు డా. కైలాసనాధ కట్జూ. ఆయన భారతదేశంలో సంపర్క (సంధాన) భాషగా ఇంగ్లీషు కొనసాగటాన్ని నిరసించారు. మరుసటి రోజు కూడా కొంతమంది పెద్దలు మాట్లాడారు డా. కట్టమంచి గంభీరోపన్యాసం అనర్గళంగా సాగింది. వ్యంగ్యోక్తులు, ఛలోక్తులు.... శరపరంపరగా దొర్లి పొయ్యాయి. శ్రోతలు మంత్రముగ్ధులయ్యారు. ''మనదేశంలో ఓ రాష్ట్రం నేను ఆర్థికంగా వెనుకబడ్డాను, నన్ను ముందుకు తొయ్యండి.... అంటుంది. మరో రాష్ట్రం లేదు. లేదు. నేను ఇంకా వెనుక బడాను నన్ను మొదట ముందుకు తొయ్యండి అంటుంది. ఇలా వెనుకబడ్డంలో మన రాష్ట్రాలు నేనంటే నేనంటూ ముందు పడుతున్నాయి.'' కట్టమంచి ఛలోక్తి సమన్వితమైన వ్యంగ్యోక్తికి. శ్రోతలు ఘొల్లుమంటూ నవ్వారు, పదేపదే నవ్వారు.

1948 జనవరి 30 సాయంకాలం ఫోను మోగింది. ఆ ఫోను మాటలు వినగానే రెడ్డిగారి ముఖంలో విషాదం అలము కొంది. ఫోను పెట్టేసి 'గాంధీజిని చంపేశారు. తెలుసా? అని నాతో అన్నారు. మరుసటిరోజు మద్రాసు ముఖ్యమంత్రి ఓ.పి. రామస్వామి రెడ్డియారు గారితో గ్రాంటు విషయకంగా జరగాల్సిన సమావేశాన్ని వాయిదావేశారు. క్షణాల్లో వైస్‌ఛాన్సలర్ డా. రెడ్డిగారి గది విశ్వవిద్యాలయంలో పనిచేసే ప్రొఫెసర్లతో, రీడర్లతో, ఉపన్యాసకులతో నిండి పోయింది. డా. కట్టమంచి గాంధీజితో తన పరిచయాన్ని భావోద్వేగంతో పేర్కొన్నారు. ఆయన మాటల్లో అపారమైన వేదన వ్యక్తమయింది.

---

★ **ఘట్టమనేని అశ్వత్థ నారాయణ** బెంగుళూరులో విశ్వేశ్వరపుర కాలేజీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ కామర్స్‌లో హిందీ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు.

దేశ విభజన కారణంగా తటస్థించిన శరణార్థుల పునర్వాస నిధులు సేకరించేందుకు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఓ శాఖను ప్రారంభించారు. భారతదేశ సైన్యంలో చేరేందుకు ఆంధ్రలోని ఏ యే ప్రాంతాల్లో యువకులు ఎక్కువగా లభిస్తారో - మొదటి ప్రపంచ యుద్ధంలో ఆంధ్రసైనికులు నిర్వహించిన పాత్రను వివరిస్తూ అప్పటి హోంమంత్రి సర్దార్ పటేల్ గారికి ఓ ఉత్తరం రాశారు.

నిజాం రాష్ట్రంలో రజాకార్ల అల్లర్ల గురించి ప్రధానమంత్రి నెహ్రూ గారికి ఓ ఉత్తరం రాశారు. నిజాం రాష్ట్రంలోని ప్రజలు ధైర్యంగా వుండాలని, ఆంధ్రప్రాంతంలోని ప్రజలు వాళ్లకు ధైర్యం చెప్పాలని వివిధ సభల్లో వక్కాణించారు.

ప్రధానమంత్రి జవహర్‌లాల్‌నెహ్రూ తన చెల్లెలు, బావ, మేన కోడళ్లతో వాల్తేరుకు వచ్చారు. ఆంధ్ర విశ్వ.విద్యాలయస్నాతకోత్సవ సంరంభం...... ఒకటే హడావిడి! ఆనందోత్సాహాలు!! నెహ్రూస్నాతకోత్సవం దుస్తుల్లో వేదిక ఎక్కి సభా సదులకు మూడు వైపులా తిరుగుతూ నమస్కరించారు. ఆయన ముఖంలో చిరునవ్వు వెనుక దాగివున్న విచారం దాచుకున్నా దాగలేక పోయింది. నెహ్రూ గారు రజాకార్ల అల్లర్లను ప్రస్తావిస్తూ, ప్రభుత్వం సరైన సమయంలో ఆ ఉపద్రవాన్ని తప్పకుండా అణచి వేస్తుందని చెప్పారు. ఆయన ప్రసంగానికి ముందు డా. సి. ఆర్. రెడ్డి మాట్లాడుతూ '' ఈ మారు రజాకార్ల.ఉద్యమాన్ని మరోసారి తలెత్తకుండా చెయ్యాలి.'' అని గర్జించి నప్పుడు శ్రోతలు గట్టిగా చప్పట్లు కొట్టారు.

తొలిసారిగా ఏర్పడిన కేంద్రమంత్రి మండలిని వాల్‌పోల్ మంత్రి మండలితో పోల్చారు. డా. సి. ఆర్. రెడ్డి గారి ఈ అభిప్రాయం కొద్ది రోజులకే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ లోని కాలం '' ఓ వర్ ఏ కప్ ఆఫ్ టీ'' లో ప్రస్తావించబడింది.

డా. కట్టమంచి రామలింగారెడ్డి గారు లండనుకు వెళ్లారు. అక్కడి నుంచి రిజిస్ట్రారు కె.వి. గోపాల స్వామిగారికి రాసిన ఓ ఉత్తరంలో ఇలా ప్రస్తావించారు: ''రెండవ ప్రపంచయుద్ధం తర్వాత చితికిపోయిన ఇంగ్లాండు, దేశవాసులు శక్తి సామర్థ్యాలవల్ల, కృషివల్ల మళ్లా ఎలా చైతన్యం పుంజుకొందో చూడండి. కాని భారతీయులమైన మనం కూర్మగతిలో ముందుకు సాగుతున్నాం ( ఇందులో రిజిస్ట్రారు కూర్మావేణుగోపాల స్వామి ఇంటి పేరుపై కాసింత హాస్యం తొణికిసలాడింది.)

డా.సి. ఆర్. రెడ్డి గారు లండన్ నుంచి రాగానే అనుకోని ఘటనలు కొన్ని జరిగి పోయాయి.

డా.సూరి భగవంతంగారు కేంద్ర ప్రభుత్వ సైంటిఫిక్ లయజన్ ఆఫీసరుగా లండన్‌కు వెళ్లిపోయారు. రెడ్డిగారి ఆప్తమిత్రులు కొంతమంది చనిపొయ్యారు. ఓ సిండికేట్ మెంబరులండన్ చేరగానే మరణించారు. రెడ్డిగారు ఈ అనుకోని ఘటనలకు తట్టుకోలేక పొయ్యారు.

ఆ రోజుల్లోనే ఓదినం ఓ జ్యోతిష విద్యాంసుడు వైస్ ఛాన్సలర్ ఇంటికి వచ్చాడు. రెడ్డిగారు ఆయనతో ఏమేమి మాట్లాడారో కాని గంటకు పైగా ఇద్దరూ ఓ గదిలో వున్నారు.

1950 ప్రాంతంలో సి. ఆర్. రెడ్డి గారు మైసూరు విశ్వవిద్యాలయానికి ప్రొ ఛాన్సలర్‌గా నియమింప బడ్డారు. ఉద్యోగ విరమణ చేసే రోజున తాను మళ్లీ వాల్తేరు వస్తనో రానో అన్న

సందేహం వెలిబుచ్చారు. కాని ఆయన అరవిందులు గూర్చి ప్రసంగం చేసేందుకని వాల్తేరు వచ్చారు.

డా. కట్టమంచి రామలింగారెడ్డి మైసూరు వెళ్లిన తర్వాత అనారోగ్యం పాలయ్యారు. 1954 ఫిబ్రవరి 24న మద్రాసులో స్వర్గస్థులయ్యారు.

డా. సి. ఆర్. రెడ్డి గారు ఆంధ్ర సంస్కృతికి ప్రతీక, ఘన విద్వాంసులు. మంచి వక్త. ఆయన విద్యారంగానికి చేసిన సేవ అపారం. ఆయన 1938 లో చేసిన తుత్తుకొరిన్ ప్రసంగం అద్భుతమైనది. "Have we not opened a new chapter in our modern history? Have we not turned out a new leaf in our racial character. His (Gandhiji's) is the swaraj of the masses, not the illusory swaraj of pompous show and powerless office, of the peacock feathers struck on with images. He has almost succeeded where the universities failed." ఆయన ఇంగ్లీషు భాషా వైదగ్ధ్యం, ఆవేశం, ఆలోచనా పటిమ, శైలి శ్రోతలను ఆకట్టుకొంటాయి.

డా. కట్టమంచి రామలింగారెడ్డి హాస్యచాతుర్యానికి కొన్ని మచ్చు తునకలు. ఆంధ్రపత్రిక దక్షిణాఫ్రికా ఎడిషను విడుదల అయ్యే సందర్భంగా ఆ పత్రికా సంపాదకులకు ఓ సందేశం పంపమని నాకు చెప్పారు. నేను సంకోచిస్తూండగా, మరో సహోద్యోగి పేరు సూచించి, ''అతను సందేశాలు పంపడంలో ఘనుడు. అతని సాయంతీసుకో'', అన్నారు. ఓ శ్రావణ మంగళవారం నాడు నా సీనియరు సహోద్యోగి ఏంచేతనో సెలవు తీసుకొన్నాడు. అతనితో పనిపడి ఎవరో ఆఫీసుకో వస్తే, అప్పుడు రెడ్డిగారు ''మీరు రేపు రండి, ఆ పెద్దమనిషి శ్రావణ మంగళవారం సెలవు మీద వెళ్లాడు.'' అన్నారు, శ్రావణమంగళవారం ముత్తైదువులు నోములు-నోచుకొంటారు.

శరణార్థుల పునరావాసనిధికై నోబెల్ ప్రైజు బహుమతీ గ్రహీత డా.సి.వి. రామన్ ఓ పెద్ద మొత్తానికి చెక్కు పంపారు. డా. సి. ఆర్. రెడ్డి ఆ మొత్తానికి సంతోషించి ''అబ్బ! ఏమిరా నీ దెబ్బ!'' అన్నారు.

ఓ సారి నేను వైస్ - ఛాన్సలర్ భవనం తాళం చెవులు జేబులో పెట్టుకొని ఇంటికి వెళ్లిపోయ్యాను. రెడ్డిగారు ఇంటికి వెళ్లి చూస్తే, తాళం చెవులు లేవు. నాకు కబురు పెట్టారు. నన్ను చూసి ఆయన ''నీవు మతిమరుపు ప్రొఫెసరులాగా తాళం చెవులు జేబులో వేసికొని, మైసూరు మహారాజా లాగా వెళ్లి పోతే నాగతేం కాను?'' అని చమత్కరించారు. నేను సిగ్గుతో తలొంచుకొన్నాను.

కొద్దిరోజుల తర్వాత నన్ను రిజిస్ట్రారు ఆఫీసుకు మార్చారు. ఆ రోజు రిజిస్ట్రారు కూర్మా వేణుగోపాల స్వామి గారు డా. సి. ఆర్. రెడ్డిని చూడటానికి వచ్చారు. అప్పుడు ఆయన రిజిస్ట్రారుతో ఇలా అన్నారు. '' ఇతను మళ్లీ నీ ఆఫీసుకు వస్తున్నాడు. మంచి కుర్రాడే, పైకి వస్తాడు.'' వెంటనే నాతో ''దీన్ని శాశ్వతంగా ఇచ్చే సర్టిఫికేట్ అనుకోవద్దు సుమా! నేను నీ పని గమనిస్తూనే వుంటాను. నేను రిఫెరీగానే వుంటాను. జాగ్రత్తా!'' అన్నారు.

ఆయన మనమరాలు మద్రాసు నుంచి వచ్చింది. కాన్వెంట్ ఉచ్చారణతో ఇంగ్లీషులో రెడ్డిగారితో మాట్లాడుతూ వుంటే ఆయన కోపంగా ''నీవు ఇంట్లో అయినా తెలుగులో మాట్లాడి ఏడవ

కూడదూ? ఓ దుబాసీని పెట్టుకొంటేగాని పని జరగదు.'' అని ఇంగ్లీషులో విసుక్కొన్నారు.

ఓ సభలో డా. రెడ్డిగారి ప్రసంగం ముగిసిన తర్వాత కళాశాల విద్యార్థినులు ఆటోగ్రాఫ్ కోసం ఆయన చుట్టూ మూగేరు. ఓ అమ్మాయి రెడ్డిగారి ఆటోగ్రాఫ్ తీసుకొంటూ ఆయన ఉపన్యాసకౌశలాన్ని మెచ్చుకొంటూ ఇలా అంది! ''నేను మీలాగే మాట్లాడగలిగి వుంటే ఎంత బాగుండేదో?'' అప్పుడు చటుక్కున రెడ్డిగారు ''అలాగానా? ఆ మాట మొదటే చెప్పివుంటే, మాట్లాడమని చేప్పె వాణ్ణి కదా? నాకీ కష్టమూ తప్పేదీ, నీకు సుఖమూ దొరికేదీ.''

గాంధీజీ నిర్యాణం తర్వాత ఓ సంతాప సభలో డా.సి. ఆర్. రెడ్డి గారు ఇలా అన్నారు! ''నేను గాంధీ గారితో కలసి పని చేశానే కాని ఆయన అనుచరుణ్ణి మాత్రం కాదు. (Though I worked with him in the Congress. I was never a follower of his.)

డా. కట్టమంచి గొప్ప ప్రతిభాశాలి. ఎదుట వాళ్ల ప్రతిభను గుర్తించి, గౌరవించే సహృదయుడు. ఉపన్యాసాల్లో విలువైన అభిప్రాయాలను వెల్లడించేవారు. పదిమంది ' ఆహో!' అనేలా మాట్లాడేవారు. నవ్వులజల్లులు కురిపించేవారు. ఒక్కొసారి ఆయన మాటలు విచిత్రంగా తోచేవి. ఈయన సిద్ధాంతాలను ఎలా అర్థం చేసుకోవాలా అనే విచికిత్సలో పడాల్సి వచ్చేది. మొత్తం మీద డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు అరుదైనవ్యక్తి.

*(Continue from 322)*

I've a dream. It's a dream of a lazy day. Of a darkened room. And me between sleep and wakefulness. She is in the next room. Baking a cake. The smell of baking becomes her conversation with me. As I lie half asleep I see a blurred image of her delicate fingers on the cake. Everything, the cake, the fingers and the contours of her body caught in soft focus. The image touches me deeply and implores me to avoid extravagance of phrase or tone. Silently I feel that she too wants madly to touch me with the smell of baking.

I've a dream. And I want it fulfilled before I sleep my last sleep. It's a dream of the sea, and of walking together on the sands, she and I. Her footprints meandering and meeting mine and wandering, snaking away as it were and coming back to meet mine again and again. We don't speak a word. We don't need to. The dalliance of our footprints by the water's edge becomes our conversation. The raging sea, the buffeting winds, the desolate sands all combine to provide a cosmic setting to the conversation of our dallying footprints. Much of this conversation remains veiled and hazy to me but all the more absorbing because of the blur. The conversation of our foot - prints meeting on the sands and wandering away, holds within it inexplicable depths - to unfold slowly forever, into newer nuances of sexuality.



## Claude Simon

*"who in his novels combines the poet's and the painter's creativeness with a deepend awareness of time in the depiction of the human condition"*

1985 Nobel Prize in Literature

MISIMI/మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No. H/SD/191.



పాబ్లో పికాసో చిత్రించిన స్వప్నరాగ శీల "స్వప్నం" చిత్రం ఇటీవల జరిగిన వేలంలో ***44*** మిలియన్ల డాలర్లకు అమ్ముడైంది. కళాఖండాలను సేకరించే ఒక జంట – విక్టర్, సలీంగంజ్‌లు – ఈ చిత్రాన్ని ***1941*** లో ***7000*** డాలర్లకు కొన్నారు. మొన్న వేలానికి పెట్టేటప్పుడు ఇది ***30*** మిలియన్ల డాలర్లు పలుకుతుందనుకొన్నారు. కాని ఈ 'స్వప్నసిరి' కలలో గూడ ఊహించని రేటు పలికింది.